అవ్వయ్యార్ యొక్క కీర్తి
స్త్రీ జాతికే కీర్తియగును



జెమినివారి

# అవ్వయ్యార్

ఇప్పుడు ఆంధ్రదేశమంతా
ప్రదర్శింపబడుచున్నది...



# చర్మ బాధలకన్నిటికీ

# సైబాల్




చర్మవ్యాధులన్నిటిని శీఘ్రంగా నివారణచేసి, విషక్రిమి నాశనిరైౖ త్వరితంగా కుదుర్చుటలో "సైబాల్" ప్రసిద్ధికెక్కింది - కురుపులు, గజ్జి, ఎక్జిమా, స్కాబీస్, మొటిమలు, తామర, కాళ్ల పగుళ్లు, వ్రణములు మొదలైన వాటిని కుదర్చడములో అద్భుతంగా పనిచేస్తుంది.






## బిడ్డల ఆరోగ్యమునకు

## ప్రసిద్ధిచెందినది:

# రమణీస్

# బేబిగ్రైప్



తయారీదార్లు:

## ది సౌత్ ఇండియన్ మాన్యుఫాక్చరింగ్ కో., మధుర.

డిస్ట్రిబ్యూటర్సు:

సీతారామా జనరల్ స్టోర్సు ఏజెంసీస్ - విజయవాడ, శికింద్రాబాద్, బరంపురము (గంజాం), బొంబాయి.

# గృహలక్ష్మి

స్త్రీల ఆరోగ్య సౌభాగ్యములను
పెంపొందించుట కేర్పడిన
సచిత్ర మాసపత్రిక

వ్యవస్థాపకులు

డాక్టరు కే. యన్. కేసరి

ఆక్టింగ్ ఎడిటర్

సి. సి. పున్నయ్య

సంపుటము ౨౨]   అక్టోబరు 1953   [సంచిక ౧౦



# విషయసూచిక


విజయీభవ 513

శ్రీ కృష్ణ మహిమార్ణవము : దేశిరాజు భారతీదేవి గారు 515

ఉత్సవాలు 517

ఆంధ్ర రాష్ట్రావతరణ మహోత్సవము 519

ఇల్లాలు : కన్నెగంటి వీరభద్రాచార్యులుగారు 521

ఎప్పుడూ యింతేనా : ద్వివేదుల విశాలాక్షిగారు 522

'కనీసపుకోర్కెలు' ప్రశంస : మొదలి వెంకట రామయ్యగారు 525

హెలెన్ కెల్లర్ 526

మధురస్మృతి : శ్రీ 'సుధాకిరణ్' 528

హైందవస్త్రీ : పోలిశెట్టి నాగేశ్వరరావుగారు 530

పొంతలు : శ్రీమతి గంగాధర భట్లగారు 536

ముచ్చట్లు : 'నారపీచు' 542

స్వామినాధన్ : చీమలపాటి సూర్యనారాయణ గారు 546

కన్నీరు : చిల్కపాటి సీతాంబగారు 564

మార్పు : వై. వి. శర్మగారు 565

సర్ అల్లాడి కాలధర్మం...తీరనిలోటు : సి.సి. పున్నయ్యగారు 574

చిత్రశాల : 576

జానపద గేయ వాఙ్మయ చరిత్ర : టేకుమళ్ల కామేశ్వరరావుగారు 579

బాలవినోదం 582

సంపాదకీయములు 584

స్వీకారం 585

పంచాంగం 586


# ఆంధ్ర మహిళ

## 10 వ వార్షిక సంచిక.

దసరా దీపావళి పండుగలకు మధ్యకాలంలో వెలువడుతుంది.

క్రొత్తగా అవతరించిన ఆంధ్ర రాష్ట్రమును గూర్చిన వ్యాసములు, వార్తలు, చిత్రములు, పారిశ్రామిక విద్యాలయపు నూతనభవన ప్రవేశ సందర్భములో తీసిన ఛాయాచిత్రములు, మహిళాసభ దసరా వుత్సవములను గూర్చిన విశేషములు, ఈ సంచికలో ఎక్కువగా ప్రకటింపబడును.

ఇంకా

ఆర్టుపేపరు అట్ట, ఆకర్షవంతమైన ముఖచిత్రం, మంచి కథలు, మనోజ్ఞమైన నాటికలు, అనుభవజ్ఞుల రచనలు, రేఖా, ఛాయా చిత్రములు, సంఘసేవాసంస్థలు, నిర్మాణ కార్యక్రమాలను గూర్చి, నిర్వాహకులచే రచనలు, ఎన్నో బొమ్మలు, వింతశీర్షికలు. ఈ సంచికయొక్క ప్రత్యేకత.

వెల : సంచిక ఒకటికి రూ. 1-8-0

దొరకు స్థలము :

(1) హిగ్గిన్ బాదమ్స్ రైల్వే బుక్కుస్టాల్స్,

(2) ఆంధ్ర మహిళాసభ, మదరాసు — 4

సంపాదకురాలు.




జయజయ గృహలక్ష్మి సఖి! జయజయ లలితాంధ్ర! మధుర సారస్వతమా!
జయజయ లలనా రత్నమ! జయజయ విద్యాప్రబోధ! జయకల్యాణీ!



---

## వి జ యో భ వ

ముక్కోటి ఆంధ్రుల వాంఛితము ఈ నెల మొదటి రోజున నూతన రాష్ట్రనిర్మాణముతోటి ఫలించింది. లక్షలాది ప్రజల ఆనందోత్సాహాల మధ్య, దేవేంద్రలోకాన్ని స్ఫురణకు తెస్తూన్న సర్వకళా శోభాయమానమయిన ఆంధ్రరాజధాని నగరం కర్నూలులో భారత ప్రధానమంత్రి పండితనెహ్రూచే ఆంధ్ర రాష్ట్రావతరణ మహోత్సవము అత్యంతవైభవంగా జరిగింది.

అవతరించిన రాష్ట్రానికి తొలిగవర్నరుగా రాజకీయ దురంధురుడు, అత్యంత సమర్థుడునైన శ్రీ చందూలాల్ త్రివేదిగారును, ప్రథమశ్రేణికి చెందిన జాతీయ వీరుడు, స్వార్థత్యాగి, ప్రజానాయకుడు ఆంధ్ర కేసరి టంగుటూరి ప్రకాశంగారు తొలిముఖ్యమంత్రిగాను ప్రమాణం స్వీకరించి, పరిపాలన కుపక్రమించడం నూతన రాష్ట్ర మహోజ్వలమైన భవిష్యత్తుకు సూచనలని ఆశించవచ్చును.

ఈ సందర్భమున ఆంధ్రరాష్ట్ర నిర్మాణమునకై ఆందోళనచేసి ఉద్యమాలు నడిపిన ఆంధ్ర నాయకుల అఖండత్యాగాలు, అచంచలమైన దీక్ష స్మరించవలసినవి. ఆంధ్రోద్యమానికి మూలపురుషులన దగిన శ్రీ దేశభక్త కొండా వెంకటప్పయ్య, దేశోద్ధారక కాశీనాధుని నాగేశ్వరావు, కందుకూరి వీరేశలింగంగారలు పేర్కొనవలసినవారు. ముఖ్యంగా యీనాడైనా సత్వరాంధ్ర రాష్ట్ర నిర్మాణమునకు కారణమైన శ్రీ పొట్టి శ్రీరాములుగారి ఆత్మబలిదానము చిరస్మరణీయమేకాక యావదాంధ్ర ప్రజానీకం శ్రీ శ్రీరాములుగారికి జోహారులర్పించి కృతజ్ఞతను వెల్లడించాలి.

పరిపాలనా సౌలభ్యార్ధమే కాకుండా సువర్ణలిఖితమైన చరిత్రగల ఆంధ్రజాతి, సంస్కృతి, భాషలకు నూతన రాష్ట్రనిర్మాణంతో నవజీవనం ప్రారంభమయింది. తమ రాష్ట్రశాంతి, సౌభాగ్య, అభ్యుదయాలు రూపొందించుకోవలసిన బాధ్యతలు పైన బ్డడినవి. తమపైనున్న గురుతర బాధ్యతల సక్రమ నిర్వహణ జరుగాలంటే ఆంధ్ర ప్రజలలో సమైక్యత, సమరస భావం, విశాల దృక్పధం పెంపొందాలి.

నూతన రాష్ట్ర నిర్మాణంతో పాలక వర్గం, ప్రజలూకూడ ఏకోన్ముఖంగా వివిధ ప్రధాన సమస్యల పరిష్కారానికి కృషి చెయ్యాలి.

నూతన రాష్ట్రంలో పారిశ్రామికంగాను, వ్యావసాయకంగాను, సాంస్కృతికంగాను అవకాశాలు మెండుగానున్నవి. రాష్ట్రంలోని సహజసంపద, ఆర్థిక వసతులు, సారవంతమయిన భూభాగం, గోదావరి, కృష్ణాలాంటి జీవనదులు, కళాకారులు, కవులు, విజ్ఞానవేత్తలు రాష్ట్రపురోభివృద్ధికి ఎంతైనా ఉపకరించవచ్చును.

జాతీయశ్రేయస్సును దృష్టిలోనుంచుకొని ఆంధ్రజాతి ముందంజవేసి భవిష్యత్తులో విశాలాంధ్రమై భారతదేశానికి, జాతికి తలమానికంగా నొప్పడం ఆంధ్రుల పవిత్రాశయం కాగలదు.



# శ్రీ కృ ష్ణ మ హి మా ర్ణ వ ము

శ్రీ కే. యన్. కేసరిగారికి అంకితము.

శ్రీమతి దేశిరాజు భారతీదేవి

## తొ లి ప లు కు

(వర్తమాన కాలమున మనదేశమున సాహిత్య ప్రవాహము వెల్లి విరియుచున్నది. భావ పరివర్తన భాషాపరివర్తన పలుముఖముల విస్తరించుచున్నది. పాశ్చాత్య భావవీధులలో మనవారు స్వైరవిహార మొనర్చుచున్నారు. సాంఘిక లౌకిక శరీరసుఖ వాంఛాలోలురై భారతీయ సాంప్రదాయముల విస్మరించి భక్తిజ్ఞానముల నిరసించుచున్నారు. ఆధ్యాత్మిక సాహితీకి గౌరవము క్షీణించుచున్నది. యువతీయువకులకు కొంచెమైనను భక్తి విశ్వాసములు, ఆస్తికత్వము గలుగ జేయుటవసరమని నాస్వల్ప బుద్ధికి దోచి యీ చిన్న వచనరచన యొనరించిన దానను. దీనివలన యువకయువతీ జనము తమ చిత్తముల పరమేశ్వరుని వంకనించుక మరల్ప జాలినచో నా ప్రయత్నము ఫలించినదని సంతసించెద. నా యీరచనకు పలయు విషయముల సేకరించి యిచ్చి నా కృషికి తగినదోహద మొసంగిన నా తండ్రిగారైన శ్రీయుత చంద్ర మౌళి చిదంబర రావుగారికి నా హృదయ పూర్వక నమస్కారము లర్పించుచున్నాను.)

### ప్ర థ మ త రం గ ము

నాడు శ్రీకృష్ణజయంతి. దేవాలయమున జరిగెడు నుత్సవ సందర్భమున ప్రజలాబాలగోపాలము ఉత్సవ సందర్శనోత్సాహులై యేతెంచుచుండిరి. బాలబాలికల ఆనందమునకు మేరలేకుండెను. గ్రామమందెక్కడ జూచిన నుట్లు గట్టియుండెను. బాలుర వేడ్క చెప్ప శక్యముగాకుండెను. ఏయింటవిన్నను భాగవతము నందలి శ్రీకృష్ణావతార ఘట్టము చదువబడుచుండెను. ఒకచోట హరికథ, వేరొక్కచో గానసభ, మఱొక్కచోట తరంగ కాలక్షేపము జరుగుచుండెను. ఇట్లత్యంతోత్సాహముతో నూరివారెల్ల రానందతరంగ డోలికల నూగుచుండిరి. ఆ వినోదంబులెల్ల వీక్షించి వచ్చిన బాలికయొర్తు మిక్కిలి యక్కజంబున, తన తల్లి నిట్లని యడిగెను. "అమ్మా మనయూరిలో జరిగిన యుత్సవమేమిటమ్మా! ప్రతీయింట పూజలు, దేవాలయములో పెద్ద యుత్సవము జరిగింది. ఇదేమి పండుగమ్మా!" ఆ పలుకులకు తల్లి చిరునవ్వునవ్వి 'కృష్ణాష్టమిగాదటమ్మా' అనెను. బాలికాశ్చర్యముతో "అంటే!"

తల్లి:- అంటేనా! శ్రీకృష్ణస్వామి పుట్టినరోజు పండుగమ్మా! నీవెప్పుడు బొమ్మనుపెట్టి యాడుకొంటావే, ఆ కృష్ణస్వామేనమ్మా! ఆయనే దేవుడు. హిందువులందరు ఆయననే స్మరించి తరించెదరు. ఆ మహానుభావుని పుట్టినరోజుగావున చాల గొప్ప దినముగా భావించి పూజించి వేడుకలు చేసుకుంటూరు.

తల్లి వాక్యములా బాలిక లేత హృదయములో గాఢముగా నాటుకొన, తానిన్నాళ్లు బొమ్మగా

దలంచి యాడుకొనే కృష్ణుడు దేవుడా? అయితే దేవునికి పుట్టుకే లేదంటారే! ఇక పుట్టినరోజు పండుగేమిటి అని తోచెను. ఏమైనాసరే కృష్ణుని పుట్టు పూర్వోత్తరాలు గట్టిగా తెలిసికోవాలనని పట్టుదలగలిగిందా చిట్టి హృదయానికి. కృష్ణుడు దేవుడా? మానవుడా? తానిన్నాళ్లు మెడలో దండలువేసి, శిఖకు పూలుజుట్టి నెమలిపింఛమలంకరించిన కృష్ణుడు మానవుల దరింపజేయగలడా? ఆయన మహిమ యెట్టిది? ఈ సందేహములా లేత హృదయమును కలవరపెట్టెను. శ్రీ కృష్ణచారిత్ర మెఱుంగవలెనను కోరిక మొలకలెత్తనా బాల తల్లితో "అమ్మా! నాకు కృష్ణుని కథనంతా బాగా చెప్పమ్మా! హరిశ్చంద్రునికథ చెప్పినావు, సావిత్రి కథ చెప్పినావుగాని కృష్ణునికథ చెప్పలేదు. తప్పక చెప్పవమ్మా" అని ప్రార్థించెను. అంత తల్లి తనయ మోమును వీక్షించి, కేవల కథాశ్రవణ కుతూహలమే గాక మఱేదో యొక సందేహ మా బాలిక హృదయను పీడించుచున్నట్లు గమనించెను. మంచిగాని, చెడుగాని వినినంతనే బాగుగ హృదయమున నాటుకొను లేతవయస్సుగాన, కృష్ణచరిత్ర నెపమున నా పిల్లకు భక్తి బీజములనాట సంకల్పించి తల్లి శ్రీ కృష్ణ కథ నిట్లు చెప్పదొడంగెను. "చిట్టీ! పూర్వము మధురానగరమున నుగ్రసేనుడను రాజునకు కంసుడను కుమారుడుండెను. అతడు మిక్కిలి మూఢుడై, క్రూరుడై సాధుల బాధించుచు, మునుల దండించుచు పుణ్యాదూరుడై బహువిధ క్రూరకృత్యములచే నిందాస్పదుడై, లోకకంటకుడై యుండెను.

ఇంతలో "అమ్మా! కమలకొక్కదానికే కథ చెప్పుతున్నావా! మాకుకూడా చెప్పవా?" అంటూ పెద్దపిల్లవాడు, పెద్దపిల్ల యింకా చిన్నపిల్లలు బిరబిర ప్రవేశించిరి. పెద్దకుమారుడు పదునారు వర్షములవాడు తల్లియొద్ద కూర్చుని తనకువలయు కథలు తెలియని వివిధాంశములు తెలిసికొనుచుండుటాచారము. చదివేది స్కూలుఫైనల్ - చిన్నపిల్లవాడు రెండవఫారము, పెద్దపిల్ల అయిదవ ఫారము. వీరందరు కృష్ణకథాశ్రవణ కుతూహలులై తల్లికడజేరిరి. తల్లి కథ సాగించెను. "ఆ కంసుడొకనాడు తన సోదరియగు దేవకీదేవిని అత్తింటి కంపుచు సరదాగా తానే రథముతోలుచు పయనమయ్యెను. కొంత దవ్వరుగునప్పటి కాతనికి నారదమహర్షి యెదురయ్యెను. 'కంసరాజా! ప్రయాణమెందాక' అని ప్రశ్నించెను. కంసుడు తన సోదరిశ్వశురగృహ ప్రయాణమెఱిగించెను. ఆ మాటలకా నారదుడు పక్కున నవ్వెను. కంసుడాశ్చర్యముతో "మునీంద్రా యేల నవ్వెదర"నెను. నారదుడు 'కంసరాజా! నీ చెల్లెలి యష్టమగర్భమున శ్రీమన్నారాయణుడుద్భవించి నిన్ను వధించున'నెను. ఆ సంగతి నెఱుంగక నీ చావు నీవే వెదకికొనుచు బోవుచున్న నీ యవివేకమున కచ్చెరునంది నవ్వితి' ననెను. అట్లుచెప్పి నారదుడు వెడలిపోయెను. అంత కంసుడాగ్రహావేశుడై దేవకినిజంప నుంకింప, వసుదేవుడు వారించి కంసుని శాంతింపజేసెనుగాని, కంసుడు భార్యాభర్తల చెఱనుంచెను." ఇంతలో నా కథకురాలి భర్త నవ్వుచు, "నిన్న యూరిలోవిన్న పురాణము చాలదా! నేడు నీవు ప్రారంభించినావాయనుచు" ప్రవేశించెను. పిల్లలు "నాన్నా" యనుచు చేరబోయిరి. పెద్దవాడు మాత్రము తనకు దోచిన సందేహ నివర్తికై తల్లి వంకనే చూచుచుండెను. తండ్రినిచూచిపిల్లలు "నాన్నా! కథ చెప్పనివ్వరా? అప్పుడే భోజనమా" యనిరి "సరే చెప్పు, నేనుకూడ వింటానని" భర్త కుర్చీలో నాసీనులైరి. పెద్దవాడు తల్లితో" అమ్మా! కథ తరువాత చెల్లాయికి చెప్పుదువుగాని, నా సందేహాలు ముందు తీర్చు" మనెను. తండ్రిగారందుకొని' నీ సందేహాలేమిటోయి' అనిరి. అతడు "నాన్నా! కృష్ణు లిద్దరా లేక యొక్కడేనా? భారతకృష్ణుడు వేరని, భాగవత కృష్ణుడు వేరని కొందరు చెప్పుచున్నారు." తండ్రి నవ్వుచు "మహామహా మేధావులే ఆ సందేహము నివర్తిచేయలేదు. ఇక మీ అమ్మట్రా తీర్చేది" అనగా బాలుడు, "కాదు నాన్నగారూ! ఎవరి యభిప్రాయ మెట్లుండునోయని యడుగుచున్నాను. అమ్మా! నీవేమందు" వనెను. తండ్రి నవ్వుచు,"అయితే చెప్పండి, విద్వాన్



(571.. పేజీ చూడుడు)

# ఉత్సవాలు



ఏటేటా దసరా ఉత్సవాలలో మాతృ స్వరూపిణియైన త్రిపురసుందరిని లక్ష్మి, పార్వతి, సరస్వతి అనే భేధములేకుండా దశరాత్రములు పూజాస్తోత్రములతో ఆరాధిస్తున్నాము.

ఈ సంవత్సరము – ముఖ్యంగా యీ నెలలో ఆంధ్రప్రజానీకం దసరా ఉత్సవాలు, గాంధీజయంత్యుత్సవాలతోబాటు నూతన రాష్ట్రావతరణోత్సవాన్ని సయితం అత్యంత వైభవంగా ఆంధ్ర రాజధానినగరంలోనే కాక ఊరూర, పల్లెపల్లెలా జరుపుతున్నారు.

దసరా ఉత్సవాలలో జరిగే శక్తి ఆరాధన ఒక్క హిందూమతానికి మాత్రము సంబంధించినది కాదు. ప్రపంచములో అన్నిమతములవారు శక్తిస్వరూపిణియైన స్త్రీ మూర్తిని ఏదో విధంగా ఆరాధించి దయానుగ్రహాలకు పాత్రమయి లక్ష్య సిద్ధిని సాధిస్తున్నారు.

భారతజాతి సయితం పరాశక్తిని భారతమాత స్వరూపంగా ఆరాధించి, దేవీప్రసాదితములైన శక్తిసామర్థ్యాలు, ఆత్మబలంతో వీరోచితంగా పోరాడి స్వతంత్రులైనారు. భారత స్వాతంత్ర్య సమరంలోనేమి, జాతీయ ఉద్యమంలోనేమి దేవీ వరప్రసాదితములైన గాంధీజీ నాయకత్వము, బోధనలవలన సాధించిన అఖండ విజయాలు, ఉత్తమలక్ష్యాలు మరువరానివి.

గాంధీజయంత్యుత్సవాలు ఉపన్యాస వేదికలకు పరిమితం కాకూడదు. గాంధీజయంత్యుత్సవాలలో ప్రతి జాతీయ వీరునిలోను గాంధీజీ బోధనలు నూతనోత్సాహాన్ని, నిర్మాణ కార్యక్రమ మందాసక్తిని, సత్య అహింసలను పురికొల్పబడటానికి వినియోగపడాలి. ఆనాడు కాని గాంధీజీ నిర్వచించిన 'రామరాజ్యం' ఏర్పడదు.

ఇంచుమించుగా జాతీయ సమరాన్ని పోలిన ఆంధ్రరాష్ట్రోద్యమము 40 సంవత్సరముల తర్వాత యీనాడు – యీనెలలో ఫలించి ఆంధ్ర రాష్ట్రము అవతరించింది. ఆంధ్ర మాత అనుంగు బిడ్డల దీక్షాత్యాగపూరితమయిన ఉద్యమఫలితంగా ఏర్పడిన నూతన రాష్ట్రమునకు శక్తిస్వరూపిణియైన ఆదిశక్తి యొక్క పరిపూర్ణ అనుగ్రహ ఆశీస్సులతో సస్యశ్యామలంగా శాంతి సౌభాగ్యాల నిలయంగా వర్ధిల్లునట్లు ఆరాధనలు, ఉత్సవాలు, పూజలు జరగాలి.



# ఆంధ్ర రాష్ట్రావతరణ మహోత్సవము

నలభై సంవత్సరముల ఉద్యమము, కృషిఫలితంగా నూతనరాష్ట్ర నిర్మాణముతో అక్టోబరు 1-వ తేదీన ముక్కోటి ఆంధ్రుల వాంఛితము నెరవేరినది.

సర్వాలంకార శోభితమై దిక్కులు పిక్కటిల్లే జయజయ ధ్వానాలు, కోలాహలములతో రాజధాని కర్నూలు నగరవీధులగుండా ఉదయం శుభముహూర్తమున అశేషప్రజానీకపు ఆనందోత్సాహ పూరితమైన అభినందనలను స్వీకరిస్తూ శ్రీ చందూలాల్ త్రివేదిగారు శాసనసభాభవనాన్ని చేరుకొని, పార్లమెంటు సభ్యులు, మద్రాసు అసెంబ్లీ స్పీకరు, ఆంధ్ర శాసన సభ్యులు, ఆంధ్ర ప్రభుత్వ ఉన్నతాధికారుల సమక్షమున ఆంధ్రరాష్ట్ర తొలిగవర్నరుగా ప్రమాణ స్వీకరణతో రాష్ట్రావతరణ మహోత్సవము ప్రారంభమయింది.

రాజభవనంలో ఆంధ్రకేసరి టంగుటూరి ప్రకాశం గారి నాయకత్వమున ఆంధ్ర తొలిమంత్రి వర్గసభ్యులచే గవర్నరుగారు అధికార ప్రమాణము చేయించారు.

నూతనరాష్ట్ర ప్రారంభోత్సవ కార్యక్రమము శ్రీమతి టంగుటూరి సూర్యకుమారి ప్రార్థనతో ప్రారంభమైంది.

మద్రాసు ప్రధాన న్యాయమూర్తి శ్రీ రాజమన్నారుగారు ఆంధ్ర రాష్ట్రానికి తొలిగవర్నరుగా ప్రెసిడెంటుచే నియమింపబడి, తనచే ప్రమాణ స్వీకారం చేయబడ్డ శ్రీ త్రివేదిగారిని ఉత్సవాగంతకులకు పరిచయంచేశారు.

శ్రీ చందూలాల్ త్రివేదిగారి ఆదేశానుసారం ముఖ్యమంత్రి శ్రీ ప్రకాశంగారు పండిత నెహ్రూను నూతనాంధ్ర రాష్ట్రానికి ప్రారంభోత్సవము చేయవలసినదిగాకోరారు.

హర్షధ్వానాలమధ్య భారతప్రధానమంత్రి పండిత జవహరిలాల్ నెహ్రూ నూతన రాష్ట్రానికి ప్రారంభోత్సవముచేస్తూ "నేడు అవతరించిన తమ రాష్ట్రాన్ని పటిష్ఠంగాను, సౌభాగ్యవంతంగాను చెయ్యడానికి ఆంధ్రదేశంలోని ప్రజలంతా పరస్పర విభేదాలను మరచి సమైక్యంగా కృషిచెయ్యాలి" అని ఉద్బోధించారు. పండితనెహ్రూ ప్రసంగించిన 46 నిముషాల కాలంలో అడుగడుగుకూ హర్షధ్వానాలు మిన్నుముట్టూ యుండినవి.

ఈ మహోత్సవ కార్యక్రమంలో భారత ఉపాధ్యక్షుడు శ్రీ సర్వేపల్లి రాధాకృష్ణ, ఇండియాహోం మంత్రి శ్రీ కట్జూ, మద్రాసు ముఖ్యమంత్రి శ్రీ సి. రాజగోపాలాచారి, మద్రాసు ప్రధాన న్యాయమూర్తి శ్రీ రాజమన్నారు, హైదరాబాద్ ముఖ్యమంత్రి శ్రీ బూర్గుల రామకృష్ణరావు, మైసూరు ముఖ్యమంత్రి శ్రీ హనుమంతయ్య, పార్లమెంటు డిప్యూటి స్పీకరు శ్రీ అనంతశయనం అయ్యంగారు, కేంద్ర మంత్రులు శ్రీ వి. వి. గిరి, కె. సి. రెడ్డిగారలు మొదలగువారు పాల్గొన్నారు.

ఇండియా ప్రెసిడెంటు తన శుభ సందేశంలో చాలకాలమునుండి జరుగుతున్న ఆందోళన ఫలితంగా ఆంధ్రుల చిరకాలవాంఛ నూతనరాష్ట్రసిద్ధితో తీరుతున్నది. దాంతో పోషించి, పెంచి, పెద్ద దానిని చేసి రాష్ట్రశ్రేయస్సు, పురోభివృద్ధులతోబాటు దేశ సౌభాగ్యానికి సయితం సమైక్యతతో కృషిచెయ్యవలసిన ఆంధ్రుల బాధ్యతలు మరింత గురుతరమైనవని పేర్కొన్నారు.

ఇండియా వైస్‌ప్రెసిడెంటు డా|| సర్వేపల్లి రాధాకృష్ణగారు "శతాబ్దాలనుండి హిందూబౌద్ధ సంస్కృతులను జీర్ణించుకొన్న సుదీర్ఘ, సుప్రసిద్ధ చరిత్ర సంపన్నులయిన ఆంధ్రులు ఆర్థిక, సాంఘిక అసమత్వరహితమయిన ఉత్తమ సమాజాన్ని రూపొందించి మానవ స్వాతంత్ర్యోన్నత్యాలను సుప్రసిద్ధంగా చేయగలరని ఆశిస్తున్నానని" వివరించారు.

ప్రారంభోత్సవం శ్రీమతి సూర్యకుమారి ప్రార్థనతో ప్రారంభమయి, ఆమెపాడిన జాతీయగీతంతో ముగింపుకు వచ్చింది.

# ఇల్లాలు

శ్రీ కన్నెకంటి వీరభద్రాచార్యులు (పల్నాటి సోదరకవులు)



నీవు గృహలక్ష్మివై
నిల్చియున్న కతాన
పావనీ! నీ సుధా
భావ మధువునుచింది
దీవెనల నర్పించి రావమ్మా! తెలుగు
తల్లిని నిల్పుకోవమ్మా!

మాయ-మర్మము-లేని
నీ యూర్మి కూర్మిలో
హాయిగా సుఖియించు
ఆంధ్ర లక్ష్మీదేవి
తీయ తీయనివిందు తేవమ్మా! తెలుగు
తల్లిని నిల్పుకోవమ్మా!

తెలుగు బిడ్డల చెలిమి
తెలుగు బిడ్డల కలిమి
తెలుగు బిడ్డల బలిమి
తెలుగు బిడ్డల యెలమి
తెలివి తేటల దిద్దరావమ్మా! తెలుగు
తల్లిని నిల్పుకోవమ్మా!

కల్ల-కపటము-లేని
యిల్లాలు వగుట నీ
యుల్లంబు మేలీయ
నుల్లాసపడుచుండు
తెల్ల తెల్లని కీర్తిఁ దేవమ్మా! తెలుగు
తల్లిని నిల్పుకోవమ్మా!

పచ్చ పచ్చని తల్లి
పసుపు కుంకుములతో
వచ్చి నీ మేలి దీ
వనల పూవుల నెల్ల
దెచ్చి మెచ్చుచు చల్లరావమ్మా! తెలుగు
తల్లిని నిల్పుకోవమ్మా!

# ఎప్పుడూ ఇంతేనా!

శ్రీమతి ద్వివేదుల విశాలాక్షి



పక్కింటి వాచి అప్పుడే నాలుగు గంటలు కొట్టింది. "సుందీ" అని అత్తగారి పిలుపు గుండెల మీద కొట్టినట్లు వినిపించింది సుందరికి. ఆ వెను వెంటనే రామీ, సీతా, లేవండి నాలుగయింది అని అత్తగారు తనతోడి — కోడళ్లను పిలవడము వినిపించింది. ఇక ఎలాగ తప్పదని లేచి బైటకొచ్చింది. ఇంకా చీకటి దట్టముగా వుంది. ఎక్కడా చీమ చిటుక్కుమన్న ధ్వనైనా లేదు. తను తప్ప మిగతా ప్రపంచమంతా నిద్రపోతూన్నట్లున్నాది సుందరికి. అవును పుండువంటి చలికాలంలో అంత చీకటిలో ఎవరు లేస్తారు. తుదకు తన తోడికోడళ్లైనా లేవలేదు. అత్తగారు మళ్లా తెలివి తెచ్చుకొని పేరుపేరునా కోడళ్లను లేపింది. వెంటనే చిన్నకోడలు గది లోంచిపిల్లవాని ఏడుపు, పెద్దకోడలు గదిలోంచి మూలుగు విన్పించాయి సుందరికి.

ఇది రోజూవున్న మామూలే. పెద్దకోడలు రామమ్మ సుస్తీ మనిషి. ఇంతచీకటితో లేచి పని చేయలేదు. అసలు ఆవిడ ఎప్పుడైనా పనిపాట్లు చేసి వుంటేగా! ఆవిడ ఏమాత్రం పనిచేసినా "వళ్లు అలసి మొదటి కొస్తేకాని పూరుకోవని" — పెద్దాయన కేకలేస్తారు. సీత చంటిపిల్ల తల్లి. ప్రక్కలోంచిలేస్తే పిల్ల పూరుకోదు. ఇక మిగిలిందల్లా సుందరి ఒక్కతే అత్తగారి పిలుపువిని లేవ్వాలసింది. అత్తగారు మాత్రం ముగ్గురినీ నోరారా పిలుస్తుంది. మహాలేచిపోతూన్నట్లు ఇదంతా ఇరుగు పొరుగులవాళ్లు విని ముగ్గురునీ సమంగా చూస్తున్నాదనుకోవాలనీ. పెద్దకోడలు రామమ్మ ఆమెకి అన్నకూతురు. సారె, చీరె చాల తెచ్చింది. చిన్నకోడలు సీత తమ్ముని కూతురు. ఒక్కత్తే ఆడపిల్ల తమ్మునికి. అతని తదనంతరము చాలా ఆస్తి కలుస్తుంది సీతకి. సుందరి మాత్రం పైపిల్ల. సుందరి పుట్టింటివారు అట్టే భాగ్యవంతులు కారు. అందుచే ముద్దు ముచ్చటా సరిగా జరగలేదని కోపం అత్తగారికి.

వీలయినంతవరకు ఆ యిద్దరి కోడళ్లను వెనకేసుకు రావడము సుందరిని కేకలెయ్యడము అత్తగారి వంతు. కాని అది లోకానికి తెలియకుండా వుండాలని గట్టిగా నోరు బ్రద్దలయేలాగ ముగ్గురికీ పనులు పురమాయిస్తూంటుంది.

తెల్లారగట్ట నాలుగుగంటలకి లేచిన సుందరికి రాత్రి పడయినా పడుక్కోనేందుకు వీలుండదు. లేచింది మొదలు చెయ్యి ఆపకుండా ఎద్దులా పాటుపడాలి. ఇంతా చేస్తే చివరకి దక్కేవి అత్తగారిచే చీవాట్లు, తోడికోడళ్ల సాధింపులు. ఇవన్నీ ఎలాగైనా భరించ గలదు కాని, ఈ విషయాలలో మొగవారుకూడా జోక్యము కల్గించుకోవడము సహించలేకపోతున్నాది.

ఒకరోజున ఇంట్లో ఏదో పితృకార్యము వచ్చింది. సుందరి మడి కట్టుగొని వంటచేస్తున్నాది. ఇంతలో ఇంటికి ఎవరో చుట్టాలొచ్చేరు. వారికి కాఫీ, ఫలహారములు తయారుచేయ్యడానికి వచ్చింది పెద్ద కోడలు. చిన్నావిడ పిల్లలకి అన్నాలు పెడుతున్నాది. ఇంతలో చంటివాడు మంచము మీదనుండి దొర్లి క్రిందపడ్డాడు. ఇక ఏముంది! ఒకటే గోల. దానితో చిన్నాయన చెట్టు, బుస్సుమన్నారు. పిల్లాడి నొక్కడినీ ఎందుకు విడిచిపెట్టావనీ, నువ్వీ యింట్లో చాకిరీ చేయడానికే వచ్చావా అనీ, తలిమ్మా వాళ్లంతా ఏమిచేస్తున్నారనీ, ఒకటేమిటి అవి, ఇవీ అన్నీ కలపి భార్యను కేకలేసేరు. ఎవరుమాత్రం తక్కువ తిన్నారని ఇక పెద్దాయనలేచారు. "నా పెళ్లాం జబ్బుమనిషి! అయినా! చచ్చీ, చెడీ పని చేస్తూనేవుంటుంది. ఇలా చాకిరీ చేస్తూంటే అది ఇక అట్టే కాలం తిరిగేలా కన్పించడములేదు. ఈ ఇంట్లో ఎవరికీ జాలీ, అభిమానములేదు. అయ్యో! జబ్బు మనిషి, దాని చేత పనిచేయించడమేమిటి. దానికి సరిగా మందూ మాకూచూసి పథ్యపానాలు చేద్దామన్న సంగతి ఎవరికీ తోచదు. ఇదిగో ఇప్పుడే చెప్తున్నాను ఈ రోజునుంచి దానివంతు పనిపాట్లు నేను చేస్తాను. దానిని ఎవరూ పల్లెత్తుమాట అనడానికివల్లకాదు. అది మంచముమీదనుండి కాలుక్రింద పెట్టదు. తెలిసిందా!" అని తమ్ముని కన్న రెట్టింపు గొంతుకతో కేకలేసారు.

ఈ గందరగోళం ఏమిటా అని ఇంటిలోనుంచి బైటకొచ్చింది సుందరి. సుందరిని చూడగానే అత్తగారు దీర్ఘాలంతీస్తూ "ముసలి ముండను, కాటికి కాళ్లు జాచుకున్న నా మీద విరుచుకు పడతారెందుకు? చీకటుండగా లేచి పడుక్కోనే దాకా వొంచిం నడుమెత్తకుండా చాకరిచేస్తున్నాను. అంతా తినేవారేకాని పనిచేసేవారు ఒకరూలేరాయె. ఇంతకీ మిమ్మలననవలసిన పనేమిటి. ఇదంతా నా కర్మంకాకుంటే పువ్వుల్లో పెట్టి పూజించే ఆ మహారాజు పోవడమేమిటి! నేనిలా మొద్దులా బ్రతికుండడమేమిటి! బ్రతికున్నందుకు మా భాగావుంది. పట్టెడన్నముకోరకు ఇన్ని మాటలు, ఇంత చాకిరీ" అని భుడబుడ రాగాలు మొదలు పెట్టింది.

ఈ మహాప్రళయమంతా తనమీదేనని సుందరికి ముందే తెలిసింది. పరధ్యానంగా ఎదురుగుండావున్న తనగదివైపు చూచింది. రామారావు ఈ జీచైరులో కూర్చొని ఏదో పత్రిక తిరగవేస్తున్నాడు. ఇవతల ఇంత గందరగోళం జరుగుతున్నా ఏమి అంటనట్లున్న భర్త మనస్తత్వం చూస్తే సుందరికి ఏమి ఆశ్చర్యం కలగలేదు. నేటికి రెండేళ్లయి చూస్తూనేవుంది. ఎప్పుడూ అతను ఇంతే. అలాగని రామారావుకి సుందరిపై అభిమానము లేదని చెప్పలేము. కాని అతను అస్వతంత్రుడు. భార్యను వెనకేసుకొని అన్నగార్లతోను, తల్లితోనూ దెబ్బలాడేపాటి ధైర్యము లేదు. ఈ అనువుచూచి తోడికోడళ్లు సుందరిని ఈసడిస్తూంటారు. వారిమాటలు పడలేక సుందరికి ఒక్కొక్కప్పుడు కళ్లనీళ్లపర్యంతమయేది. కాని ఏమి చేస్తుంది. తనభర్తకేలేని స్వాతంత్రత తన కెక్కడిది? ఇలాచాకిరీ చేస్తూ వీరిచేత తిట్లు, చీవాట్లూ తింటూ బ్రతక వలసిందేనా? తనకీ జీవితానికిక సుఖపడే యోగంలేదా అని విచారిస్తూండేది. తనూతోడి వారిలా పిల్లా పాపా కనుక్కొని భర్తతో కలాసాగా

కాపురము చేసే సమయమెన్నటికయినా రాదా అని తిరిగి ధైర్యము తెచ్చుకొనేది.

ఏమయితేనేమి ! సుందరి దినచర్యలో ఏమాత్రము మార్పులేకుండానే రెండేళ్లు గడచిపోయాయి. రామారావు ఇప్పుడు ఏదో ఆఫీసులో గుమాస్తాగా పని చేస్తున్నాడు. నెలకి డెబ్భయి రూపాయలు జీతం తెస్తున్నా ఇంటిలో అతని స్థానం పూర్వంలాగే వుంది. వీరిలోనుంచి వేరుపడే మార్గములేదు. ఇక ఈ ఇంట్లో స్వతంత్రముగా వ్యవహరించే అవకాశము లేదు. రామారావు సంగతే ఇలావున్నపుడింక సుందరి గురించి చెప్పేదేమిటి ? తన భర్తకి వుద్యోగమయే కయినా హాయిగావుండొచ్చని ఇదివరకు ఆసించింది. అదివట్టి అడియాసేయని తేలిపోయింది. ఒక మృత్యువుతప్ప తనని ఈ బాధలనుండి వేరు చేయడానికి ఎవరికి అవకాశములేదని విచారించేది. ఇదంతా తన పూర్వజన్మలో చేసుకొన్న పాపమే లేకుంటే తనకి చిన్నకోడలులా పిల్లలేనా పుట్టకూడదా ? ఏమిటో పిల్లలంటే కష్టమనుకుంటాము కాని అదీ ఒకందుకు మంచిదే. ప్రిలేడుస్తున్నారనైనా ఒక ఘడియ నడుము వాల్చవచ్చు. అత్తింటివారికి కోడలుపై దయలేక పోయినా, పిల్లల మీద ప్రేమచేనైనా తల్లిని బాగా చూస్తారంటారు పెద్దలు. తనకి ఆ యోగం ఇక లేనట్టేవుంది. పోనీ అధమపక్షం పెద్దకోడలులావళ్లు కందని రోగమేనావస్తే బాగుండును. ఏదో విధంగా తనని ఈ బాధలనుండి తప్పింపమని భగవంతుని ప్రార్థించేది.

సుందరి ప్రార్థన ఒకవిధంగా భగవంతుడు మన్నించేడు. తొమ్మిది నెలలూ మోసి పనసపండంటి పిల్లాడిని కన్నాది సుందరి. వచ్చీపోయే బంధువులు పిల్లడిని చూచి నిజంగా సుందరి అదృష్టవంతురాలని పొగిడేవారు. ఇంట్లోవారు కూడ ఈసడింపుమాని సరదాగా మాట్లాడుతున్నారు. పగటివేళ పెళ్లాముతో మాటాడనైనా మాట్లాడని రామారావు గంటకొకమారు ఏదో పని కల్పించుకొని గదిలోకొచ్చి తల్లీ పిల్లా యోగక్షేమాలు కనుక్కుంటున్నాడు. పురిటి ఇరవై రోజులు కాలుమీద కాలువేసుకొని రాణిలా కూర్చుంది సుందరి. తనకి జ్ఞానమొచ్చిన తరువాత ఇంత విశ్రాంతిగా ఇంత సంతోషంగా ఎప్పుడును తను వుండలేదనుకొంది. ఇక తనకి కష్టదినాలన్నీ తీరిపోయాయనుకొంది. తనూ చిన్నకోడలిలా తెల్లారి పిల్లడిని చంకవేసుకొని లేవచ్చు అనుకొంది. ఇంకా పిల్లలు లేరా అని ఇదివరకు తన వంక హేళనగా చూసేవారికందరికీ పండొంటి తన కొడుకుని చూపించొచ్చు తనూ వారికేమి తక్కువకాదనీ. పాపాయిని ఆడిస్తూ, పాలిస్తూ రోజొక క్షణంలా గడపవచ్చు. ఇక తనతో ఎవరు మాట్లాడక పోయినా లోటులేదు. ఇలాంటి ఆలోచనలతోనే ఇరవై రోజులు ఇట్టేగడిచి పోయాయి సుందరికి. సుందరి తల్లి తండ్రీ వచ్చేరు. ఇరవై ఒకటవరోజుని బారసాల చేయడానికి నిశ్చయించేరు. కొంతమంది బంధువులు కూడా వచ్చేరు. వుదయాన్నే తలంటుకొని సుందరి తలిదండ్రులు తెచ్చిన కొత్తబట్టలు కట్టుకున్నారు సుందరీ, రామారావులు. పురోహితుడు మంత్రాలు చదివి విఘ్నేశ్వర పూజావగైరా తంతంతా నడిపించేడు. పిల్లాడికి ఆనందరావని నామకరణము చేసేరు. తాతగారు ఒత్తులూ, నాయనమ్మ గొలుసూ పెట్టారు పిల్లాడికి. రెండుమూడు రోజులలో వచ్చిన బంధువులంతా వెళ్లిపోయేరు. తిరిగి స్వజనులే మిగిలేరు.

అట్టే ఆర్భాటాలు లేకుండా నెలరోజులు గడిచిపోయాయి. భగవంతుడా ! ఈ నాటికయినా శాంతించిందికదా ! ఈ గృహసంగ్రామమని ఆనందించేడు రామారావు. కాని ఆ సంతోషం అట్టే రోజులు నిలువలేదు. సుందరికి రెండురోజులు జ్వరం రావడముతో మరల ప్రారంభమయింది సంఘర్షణ. ఈ చాకిరీ నేను చేయలేనని అత్తగారూ, నా పెళ్లాము రోగిష్టిదని పెద్దాయని, నా పిల్లలూరుకోరని చిన్న కోడలు. సుందరికి జ్వరము తగ్గి పథ్యము తిన్నదిలగాయతు మళ్లా మొదలయింది కార్యక్రమం. ఎవరి పిల్లల్ని వారు పెట్టుకొని కూర్చుంటే కనుకెలాగవుతాయని అత్తగారు, నిద్రపోతూన్న పిల్లాడిని కోరి

లేపడమెందుకని తోడికోడలు. అద్దినుందరి అదృష్టమో, దురదృష్టమో కాని పాలకైనా లేచి ఏడవడు పాపాయి. తనూ చిన్నకోడలులా చంటి పిల్లతల్లే. అయినా తన పిల్లడు ఏడ్వడు కాబట్టి పూర్వంలాగే చీకటితో లేవవలసిందే! రాత్రి పదిఅయిందాకా ఇంటి చాకిరీ అంతా చేయవలసిందే. అత్తగారు పిల్చేసరికల్లా అలారం పెట్టినట్లు ఎలా ఏడుస్తాడా ఆ పిల్లడు (చిన్న కోడలు కొడుకు) అని ఆశ్చర్యపోయింది సుందరి. ఈ మాటే భర్తతో అంటే “బుగ్గ చిక్కితే సరి” అన్నాడు. “అయ్యో బాబోయి లేవమోస్తుందని — చంటి పిల్లాడిని కోరి ఏడ్పించడమా? నా తండ్రీ! నేనలా ఎన్నడూ చేయనమ్మా, నాకు బాధ తప్పుతుందని నిన్ను బాధపెట్టనులే” అన్నాది వుయ్యాలలోవున్న పాపవేపు చూస్తూసుందరి. “అమ్మా! ఈ బాధలు నీకెన్నాళ్లులే; నేపెద్దవాడి నవుతున్నాను కదా? నిన్ను సుఖపెడతానన్నట్లు” చిరునవ్వు నవ్వేడు చిన్నపాపాయి.



# కనీసపు కోర్కెలు

**పొదలి వెంకటరామయ్య**

[మా జూన్ మాసపు గృహలక్ష్మిలో ప్రచురిత మయిన ‘కనీసపు కోర్కెలు’ అనే కథను ప్రశంసించుచు శ్రీ పొదలి వెంకటరామయ్యగారు పంపిన అభిప్రాయమును యీ దిగువ కృతజ్ఞతా పూర్వకముగా ప్రచురిస్తున్నాము. మా పత్రికలో ఉత్తమాదర్శాలను, లక్ష్యాలను ప్రబోధిస్తూ సంఘపురోభివృద్ధికి తోడ్పడుతూ, వినోద విజ్ఞానములను ప్రసాదించు క్లుప్తముగా రచింపబడు వ్యాసములను ఎల్లప్పుడూ ప్రచురించగలము.-సంపాదకుడు]

“జూన్” మాసపు “గృహలక్ష్మి” సంచికయందు శ్రీమతి ద్వివేదుల విశాలాక్షిగారు రచించిన “కనీసపు కోర్కెలు” అనే కథానిక చాలా ప్రశంసనీయంగా ఉంది. తాత్కాలికమైన ఉద్రేకమునకు లోనై “స్వేచ్ఛ-స్వాతంత్ర్యం” కావాలని ఆందోళనము జరుపదలచుకొనే మహిళాలోకానికి శ్రీ విశాలాక్షిగారు ఒక చక్కని సందేశాన్ని అందించారు. ఒకానొక సమస్యలోని నగ్న సత్యాన్ని గుర్తించి తన అభిప్రాయాన్ని ధైర్యంతో లోకానికి వెల్లడించగలిగిన యిలాంటి రచయిత్రులను ప్రోత్సహించడం అవసరము.

—(౦)—

# హెలెన్ కెల్లర్

హెలెన్ కెల్లర్ చాలా విచిత్రమైన వ్యక్తి. భగవంతుడు ఎన్ని లోపాలు పెట్టినా వాటిని అన్నిటినీ కూడా అతిక్రమించి మానవుడు ఎంత ఉన్నత స్థానాన్ని అందుకోగలడో ఈవిడచరిత్రనిరూపించుతోంది. ఆబాల్యంగా గ్రుడ్డిది, చెవిటిది, మూగది, భగవంతుడు పాపం ఆమెను అలా చేశాడు. కాని తన మానసిక బలంతో ఈవిడ ఈ మూడు అవరోధాలనూ జయించి విజ్ఞానవంతురాలై, అసమానమైన వక్తృత్వ సామర్థ్యాన్ని సంపాదించి అమెరికాలోని అంధులకందరికీ విజ్ఞానభిక్షను పెట్టే సేవాకార్యానికి తన జీవితాన్ని అంకితంజేసి అసమాన కీర్తిని ఆర్జించుకుంటున్నది.

మూగతనాన్ని అధిగమించి ఆవిడ వాక్పాటవాన్ని సంపాదించుకున్న పద్ధతి, మానవ చరిత్రలో ఒక అద్భుత సంఘటన అంటున్నారు.

పదవ సంవత్సరంలో కెల్లర్ బ్రెయిలీ లిపిని ఆధారంచేసుకుని విద్య నేర్చుకుంటున్నది. ఆ తరుణం గ్రుడ్డిది, చెవిటిది మూగదీ అయిన ఒక నార్వేదేశపుస్త్రీ చదువను వ్రాయనూ మాట్లాడనూ నేర్చుకున్నదన్న వార్త ఆమెకు తెలిసింది. హెలెన్ కెల్లర్ ఆనీసల్లివాన్ అనే ఉపాధ్యాయురాలి దగ్గిరికి వెళ్ళి "నేను మాట్లాడాలి" అనే అక్షరాలు పెగుల్చుకుని ఉచ్చరించింది. నాటినుంచీ హెలెన్‌కు సల్లివాన్ ఉపాధ్యాయురాలుగానూ, ఆప్తస్నేహితురాలుగానూ తయారైంది.

హెలన్ కెల్లర్‌ను, బోస్టన్‌కు తీసుకువెళ్లి అక్కడ చెవిటివాళ్ళకు విద్యచెప్పే 'హొరేస్‌మాన్' పాఠశాలలో చేర్పించింది. అప్పటినుంచీ కెల్లర్ అక్కడ ఒకవేపున చదువు నేర్చుకుంటూ, రెండోవైపున తనకు తానుగా శబ్దోచ్చారణను సాధన చెయ్యటం మొదలు బెట్టింది. పదాలనూ శబ్దాలనూ ఎడతెరపీ లేకుండా సాధన చేసింది. అలా సంవత్సరాల తరబడి సాధనచేసింది. అలా సంవత్సరాల తరబడి సాధనజేసి, బహిరంగసభలో నిల్చుని గంభీరోపన్యాసం చేయగల ప్రతిభను సంపాదించింది.

విజ్ఞానార్జనలో అలాగే నిరంతరం కృషి చేసి 1904 నాటికి రాడ్‌క్లిఫ్ విశ్వవిద్యాలయంలో గ్రాడ్యుయేటు పట్టా పుచ్చుకుంది.

నాటినుంచీ నేటివరకూ తన జీవితాన్ని, అంధులవిద్యాభివృద్ధి, సేవకు అంకితంచేసి కృషిచేస్తున్నది. యూరప్ యావత్తు సంచారంచేసి అనేక బహిరంగ సభలలో ఉపన్యసించి, అమెరికాలోని "అంధుల రక్షణ వ్యవస్థకు" నిధులు వసూలు చేసింది. ఇప్పటికి ఇదే కృషిలో నిమగ్నురాలై వుంది.

గతమాసం ఇలాగే లాటిన్ అమెరికాలో సంచారానికి బయలుదేరితే, ఆ విమానం చిలాన్ దగ్గిర తుపానులో చిక్కుకుపోయింది. అప్పుడు చిలీ అధ్యక్షుడు కారలోక్, ఒక సైనిక విమానాన్ని అక్కడకి పంపి ఆవిణ్ణు సురక్షితంగా తనమందిరానికి చేర్పించాడు.

(ఆంధ్ర పత్రిక నుండి)

—— (o) ——

# మధుర స్మృతి

బోసి నోటి నవ్వులందు
ఈసులన్ని కరగి పోవు!
మోసగాండ్ర హృదులు భవద్
వదన కాంతిఁ దరగి పోవు!

పూసలందు ముత్యము వలె
పొరుగు పౌరులం గలసి
వాసిత గుణ బీజములను
పెంచినావు చెలువ పొలులయ!

భరతదేశ భాగ్య సౌధ
ద్వారదేశ తోరణాళి
మంగళము చిందు - నయనములోలుక
మధుర భవత్ సూక్తిమాల!

మరువలేము! గాంధితాత!
మధురమైన నీదు రూపు!
పరుల హృదయ కల్మషముల
పరవిశోధ రూపుమాపు!

దివ్యమధుర శీతలార్ద్ర
ధవళ దృక్కులను బఱపుము!
దంబ మెఱుగ నట్టి బాపు!
మా నమస్సు ప్రేమ గొనుము!!

శ్రీ సుధాకిరణ్

# స్త్రీ సమస్యలు



## హైందవ స్త్రీ

శ్రీ పోలిశెట్టి నాగేశ్వరరావు

"ఒక జాతి ఎంతవరకూ నాగరికత చెందినదో తెలుసుకోవాలంటే, వారి స్త్రీలు ఏ దశలోవున్నారో గమనిస్తే చాలు" అన్నాడు కర్నల్ టాడ్. మహోన్నత నాగరితకు నిలయమైన భారతదేశంలో స్త్రీకి పురుషునితోపాటు సరిసమానమైన గౌరవ స్థానం సంఘంలో యివ్వబడింది. పాశ్చాత్య స్త్రీలవలె హైందవస్త్రీకి స్వేచ్ఛా స్వాతంత్ర్యములు లేవని ఒకప్రవాదంవుంది. కాని యిది చరిత్రజ్ఞానహీనతవల్ల జనించినదే. విల్సన్ పండితుడు — "ప్రాచీన కాలంలో హిందువులు స్త్రీల విషయములో చూపిన గౌరవాదరములు మరెవ్వరూ చూపలేదని నిస్సంశయముగా చెప్పవచ్చు"అన్నాడు. మనం ఇప్పుడు ప్రాచీన కాలంలో హైందవ స్త్రీకి ఎటువంటి గౌరవ స్థానం యివ్వబడిందో తెలుసుకుందాం.

మన దేశంలో స్త్రీని "అర్థాంగి" అన్నారు. పురుషునితోపాటు స్త్రీకికూడా సమానమైన హక్కులు వున్నవని దీని భావం. వివాహబంధనంతో భార్యభర్తలు ఏకవ్యక్తిగానే పరిగణింప బడతారు. భార్యవినా భర్తకు, భర్తవినా భార్యకు సంపూర్ణవ్యక్తిత్వంగాని, యోగ్యతగాని లేదు. మత సాంఘికాచారములు సమస్తమూ ఉభయులు కలసి నిర్వహించవలసిందే. నదిగంగస్నానాలు మొదలుకొని కన్యాదానంవరకూ ధర్మపత్ని ప్రక్కను వుండితీరాలి. సీతను పరిత్యజించిన పిదప శ్రీరాముడు బంగారు సీతను ప్రక్కనుంచుకొని యాగం పూర్తి చేశాడు.

మన పూర్వీకులు స్త్రీని ఎంతో గౌరవించి ఆదరించేవారు. ఉత్తమస్నేహితురాలుగా చూచేవారు. అంతేకాదు మోక్షసాధనమని నమ్మేవారు. మహాభారతంలో "భార్య భర్తలో సగంభాగం, స్నేహితులలో ఉత్తమురాలు, మోక్షసాధనం" అని చెప్పబడింది. యక్షప్రశ్నలలో ధర్మరాజు నరునికి దైవికబంధువు భార్య అని జవాబిచ్చాడు. నూరు తప్పులు చేసినా స్త్రీని పుష్పంతోనైనా కొట్టవద్దని హిందూ ఋషి ప్రవచనం. మను ధర్మశాస్త్రంలో

మనువు స్త్రీకి ఎంతో గౌరవస్థానం, ఎన్నో హక్కులు యిచ్చాడు.

"ఎక్కడ స్త్రీలు గౌరవింపబడుతున్నారో అక్కడ దేవతలు ప్రసన్నులవుతున్నారు. ఎక్కడ అగౌరవింప బడుతున్నారో అక్కడ ఆచరించే సత్కార్యములన్నీ నిష్ఫలమవుతున్నాయి." అన్నాడు మనువు. ఇంకా యిలా అన్నాడు - "భర్త భార్యను గౌరవ బుద్ధితో చూడాలి. గుణవంతురాలైన భార్య గృహానికి దీప్తినిస్తుంది. ఆమె సాక్షాత్తు లక్ష్మీదేవివంటిది." స్త్రీని పురుషుడు యావజ్జీవితం రక్షించాలని యిలా శాసించాడు. స్త్రీని కౌమారంలో తండ్రి, యవ్వనంలో భర్త, వార్ధక్యంలో కుమారుడు రక్షించాలన్నాడు. దీనికి కొందరు స్త్రీని శాశ్వతంగా పురుషుని మీద ఆధారపడేటట్లు చేసి, బానిసగా మార్చాని విమర్శిస్తున్నారు. కాని యీ వాదంలో సత్యంలేదు. ఎందువల్లనంటే పురుషుని మీద ఆధారపడి వున్నప్పటికి ఆమె సంపూర్ణస్వేచ్ఛను అనుభవిస్తూనేవుంటుంది. స్త్రీని కౌమారంలో తండ్రి ఎంతో ముద్దుమురిపాలతో పెంచుతాడు. యవ్వనంలో భర్త, గృహరాజ్యంలో ఆమెను రాణిని చేసి, అనురాగంతో ఆదరిస్తాడు. వార్ధక్యంలో పుత్రుడు పూజ్యభావంతో మాతృదేవిగా ఆరాధిస్తాడు. ఈ ప్రపంచములో యింతకంటే అబల ఆశించేదేముంది?

మనువేకాకుండా గౌతముడు, వసిష్ఠుడు మొదలైన మహాఋషులు, ఎంతోవిశాల హృదయంతో, నిష్పాక్షిక బుద్ధితో స్త్రీ విషయమై శాసించివున్నారు. గౌతముడు భార్య వ్యభిచరించినప్పటికీ ప్రాయశ్చిత్తం చేసి అదుపులో వుంచాలన్నాడు. వసిష్ఠుడు భార్య శత్రువులచే జిక్కినప్పుడు, దొంగలు ఎత్తుకు పోయినప్పుడు, బలాత్కారంగా చెరచబడినప్పుడు ఆమెను పరిత్యజించక పరిగ్రహించాలన్నాడు. ఎందువల్లనంటే అదిఆమె అపరాధం కాదుగదా!

మన దేశంలో ఋగ్వేదకాలంనాటికే వివాహవ్యవస్థ బలీయంగా ఏర్పడివుంది. వేదకాలంలో స్త్రీ విద్యవుండేది. ఆమె విద్య, విషయగ్రహణం కంటే, శీలాన్ని పెంపొందించేదిగా, గృహనిర్వహణకు సంబంధించేదిగా నుండేది. గృహజీవితంలో తన వ్యక్తిత్వాన్ని నిలబెట్టుకుంటూ, శీలాన్ని పెంపొందించుకుంటూ, భర్తకు సహాయకారిగా వుండే విధంగా ఆమె తయారు చేయబడేది. శిశుపోషణకూడా నేర్పేవారు.

వేదకాలంలో స్త్రీ ఉదయమేలేచి గృహకృత్యాలలో పాల్గొనేది. నూలు తీసేది. పొలంకాసేది. తన పిల్లలకు విద్యాబుద్ధులు నేర్పేది. భర్తకు సేవ చేసేది. సమర్ధతతో గృహకృత్యాలను నిర్వహించి, గృహాన్ని శోభతోనింపి

ఆనందనిలయంగా మార్చి, భర్త అనురాగాన్ని పొందేది. అంతేగాకుండా అవకాశమున్నప్పుడల్లా హిందూ సంస్కృతికి ఎంతో తోడ్పడేది. మైత్రేయి, గార్గి మొదలైన విద్వాంసురాండ్రు వేదాంతచర్చలలో పాల్గొనేవారు.

పురాణకాలంలోకూడా స్త్రీ విద్య విరివిగా వ్యాప్తిలో వుండేది. సీతాదేవి అనర్గళంగా సంస్కృతం మాట్లాడగలిగేదట. పార్వతి, శకుంతల విద్యావతులని కాళిదాసు కావ్యాలవల్ల తెలుస్తున్నది.

ఆకాలంలో హైందవస్త్రీ లలితకళలలో ప్రవీణురాలు. సంగీతం, నృత్యం, చిత్రలేఖనం మొదలైన లలితకళలు ఎంతో ప్రోత్సహింపబడేవి. విరాటుని పుత్రిక ఉత్తర అర్జునుని వద్ద నృత్యం నేర్చుకునేదన్న విషయం లోకవిదితమే.

ఆ కాలంలో ఘోషాపద్ధతికూడా లేదు. అంతే కాక వారు రణరంగాల్లోకూడా పాల్గొనేవారు. దశరథుని వెంట కైకేయి, శ్రీకృష్ణుని వెంట సత్యభామ రణరంగాలకి పోయి శత్రువులను ఓడించి, భర్తలమన్ననలకు పాత్రులయ్యారు.

ఇక వివాహ విషయము తెలుసుకుందాం. ఆ రోజులలో కన్యలకు తగినవరుని నిర్ణయించుకునే స్వాతంత్రముండేది. స్వయంవరంద్వారా తగిన భర్తను ఎంచుకుని వివాహమాడేవారు. బాల్య వివాహాలుకూడా లేవు. సీత, సావిత్రి, కుంతి, ద్రౌపతి మొదలైనవారు యవ్వనవతులైన తర్వాతనే వివాహంచేసుకున్నారు. వితంతు వివాహాలుకూడా వుండేవి. నాగరాజైన ఐరావతుని వితంతుకుమార్తెను, అర్జునుడు వివాహమాడి ఆమెవల్ల కుమారునికన్నాడు. కౌటిల్యుడు, వసిష్ఠుడు, మనువు మొదలైనవారు వితంతు వివాహానికి అనుమతించారు. మనుస్మృతిలో-భర్త చనిపోతే భార్య మరొకనిని వివాహమాడవచ్చునని వుంది. భర్త పతితుడైనా, నపుంసకుడైనా, భార్యను వదలివేసినా ఆమె యింకొకనిని వివాహ మాడవచ్చునని శాసించాడు.

ఇక విడాకులహక్కునుగురించి తెలుసుకుందాం. ప్రస్తుతం మనదేశంలో కొందరు విడాకుల హక్కును శాసనం చెయ్యబోతుంటే వ్యతిరేకతను ప్రదర్శిస్తున్నారు. ఇది చాలా శోచనీయమైన విషయం. కొన్ని వేల సంవత్సరములకు పూర్వమే మన శాస్త్రాలు విడాకులకు వొప్పుకున్నవి. వశిష్ఠుడు, భర్త పరదేశాంతర్గతుడైనట్లయితే ఐదు సంవత్సరములవరకు ఆగి తర్వాత పెళ్లిచేసుకోవచ్చునన్నాడు. నారదస్మృతిలో - భర్త చనిపోయినప్పుడు, సన్యాసిగా మారినప్పుడు, నపుంసకుడైనప్పుడు, కుల భ్రష్టుడైనప్పుడు, తిరిగి వివాహమాడవచ్చుననివుంది. వరుడు పరకులస్తు

డైనా, కులంనుండి వెలివేయబడినా, నపుంసకుడైనా, బానిసైనా, దీర్ఘరోగైనా, దురుద్యోగైనా, సగోత్రీయుడైనా, పెళ్లి చేసినప్పటికీ, వధువును మరొకనికిచ్చి వివాహం చేయవలసిందని కాత్యాయనుడన్నాడు. కౌటిల్యుడు అర్థశాస్త్రంలో, నీచుడు, పరదేశగతుడు, రాజద్రోహి, ఘాతకుడు, పతితుడు, నపుంసకుడు అయిన భర్తలను భార్యలు విడిచిపెట్టవచ్చునన్నాడు. అందువల్ల విడాకులు శాస్త్ర సమ్మతమే. విడాకులు హక్కు కూడా కొన్ని అత్యవసరమయిన విపరీత పరిస్థితులలోనే అనుమతిస్తున్నారు. అందువల్ల అత్యావశ్యకమైన ఈ హక్కు స్త్రీలకు వుండరాదని వ్యతిరేకించటం మనస్త్రీలకు ద్రోహం చెయ్యటమే. కొంతమంది, విడాకుల హక్కు శాసనం కాగానే పాశ్చాత్య స్త్రీలవలె హిందూస్త్రీలుకూడా వెరిముద్రికాకులతో కోర్టులెక్కి వివాహవ్యవస్థను పాడుజేస్తారని అపోహపడుతున్నారు. పాశ్చాత్య స్త్రీలను దృష్టిలో పెట్టుకొని మాట్లాడేవారికి హైందవస్త్రీ మనస్తత్వం బోధపడదు. సీత, సావిత్రి, దమయంతి మొదలైన పతివ్రతలు ఆదర్శంగాగల హైందవస్త్రీ విడాకుల హక్కును దుర్వినియోగం చేస్తుందనుకోవటం పొరపాటు. పతిభక్తికి త్యాగనిరతికి, సహనానికి ప్రపంచ ఖ్యాతి పొందిన భారతనారిని అనుమానించటం అవమానించడమే. విడాకుల హక్కు శాసనం కానంతవరకూ మన అభ్యుదయానికి అర్థంలేదు.

హైందవస్త్రీ సహనానికి స్వార్థత్యాగానికి ఖ్యాతి పొందింది. బాధా సహనమే ఆమె సతీత్వం. పార్వతి పరమేశ్వరుని తన సౌందర్యముతో గాక ఘోర తపస్సు చేసి వశంచేసుకుంది. సీతాదేవి అష్టకష్టాలు అనుభవించటానికి భర్తతో అరణ్యానికి పోయింది. గాంధారి భర్తకులేని దృష్టి తన కెందుకని కళ్లకు గంతలు కట్టుకుంది. ఇంతెందుకు భర్త మృతి చెందగానే భర్తతోబాటు అగ్నికి ఆహుతైన 'భారతనారి స్వార్థత్యాగం ప్రపంచంలో మరెక్కడ గాంచగలం?

భారత స్త్రీ పతివ్రత. ఆమెకు భర్తకంటే వేరేదైవంలేడు. పతిభక్తివల్ల అనసూయ, సుమతి, సావిత్రి మొదలైన పతివ్రతలు ఎన్నో మహత్కార్యములను సాధించారని పురాణాల్లో చదువుకున్నాం. కాని ఆమె పతిభక్తిని ఆధారంగా తీసుకొని కొంత మంది భర్తలు ఆమెను అణగద్రొక్కటం మొదలు పెట్టారు. ఇది శోచనీయమైన విషయం. సీత, అనసూయతో అంటుంది తన భర్త తల్లివలె తండ్రివలె తనను ప్రేమించాడని. భర్తలుభార్యల యెడల చూపవలసిన 'ఆదర్శం, అనుసరించవలసిన ధర్మం అదే.

పతి భక్తి విషయమై కొంత ఆలోచిద్దాం. సాధారణ దృష్టికి, పతిభక్తి ఏమిటి, భర్తను దైవంగా ఆరాధించటమేమిటని విపరీతంగా కనిపిస్తుంది. పురుషులు అహంకారంతో దైవాన్ని ఆరాధించుకునే హక్కుకూడా స్త్రీకి లేకుండా చేశారని పిస్తుంది. కాని అదేమీగాదు. భారత నారి తన భర్తలోనే భగవంతుణ్ణి చూస్తుంది. దైవంగా ఆరాధిస్తుంది. భర్త ఆమె భక్తిని ఆధారంగా తీసుకుని తనలో దైవగుణాన్ని పెంపొందించుకుని, భార్యకు దివ్యత్వానికిదారి చూపుతాడు. ఈవిధంగా భార్యపతిభక్తి భర్తలో ఆధ్యాత్మికశక్తిని పెంపొందించటానికి తోడ్పడుతుంది. ఇదే పతిభక్తియొక్క పరమార్థం.

ప్రస్తుతం మన దేశ స్త్రీలలో ఎక్కువ మంది అవిద్యతో, అజ్ఞానంతో, అనారోగ్యంతో బాధపడుతూ అధోగతిలో వున్నారు. కాలానుగుణ్యంగా ప్రస్తుత పద్ధతులను మనం సంస్కరించుకోలేకపోతే మనదేశం పురోగమించలేదు. నేటిస్త్రీకి ఓటింగు హక్కుకూడావుంది. గనుక ఆమె అవిద్య అజ్ఞానం మనదేశ రాజ్యాంగాన్నే తల్లక్రిందులు చేయవచ్చు. అందువల్లస్త్రీ విద్య దేశమంతటా విరివిగా వ్యాప్తిచెందాలి. ప్రస్తుత విద్యావిధానం స్త్రీకి కావలసిన విద్య నేర్పక పోగా విద్యార్థినులఆరోగ్యానికి భంగకరమై సంసార జీవితానికి పనికిరాకుండా చేస్తూవుంది. అందువల్లస్త్రీ విద్యావిధానం మార్చబడాలి. స్త్రీవిద్యలో విషయగ్రహణకే కాకుండా, గృహనిర్వహణకు, శీలాభివృద్ధికి, ఆరోగ్య సంరక్షణకుకూడా ప్రాధాన్యం యివ్వాలి. గృహ పరిశ్రమలు, పాకకళ, శిశు పోషణ, గృహ వైద్యంకూడా నేర్పాలి. సంగీతం, నృత్యం, చిత్రలేఖనం మొదలైన లలిత కళలకుకూడా ప్రముఖస్థానం యివ్వాలి. సంగీతంరాని స్త్రీ సుగంధంలేని కుసుమం వంటిది. అందువల్ల సంగీతం నేర్పాలి. యుక్తవయస్సు వచ్చేవరకూ బాలికలకు నృత్యం విధిగా నేర్పాలి. ఎందుచేతనంటే బాలురకు వ్యాయామం ఎటువంటిదో బాలికలకు నృత్యంకూడా అటువంటిదే. పైగా నృత్యం అభ్యసించటంవల్ల అందమైన అంగసౌష్టవం బాలికలకు కలిగి నిల్చున్నా, కూర్చున్నా అదొక కళా భంగిమంగా గోచరించి వారి సౌందర్యానికి ఎంతో దోహదమిస్తుంది.

చాలామంది విద్యార్థినులు పురుషుల వలె ఉద్యోగాలు చేయాలని ఉబలాటపడ్తున్నారు. కాని ఉద్యోగంలోకి దిగాక తెలుస్తుంది నరకబాధ. అదే కాకుండా సౌఖ్యమయమైన గృహజీవితం నాశనమైపోతుంది. స్వర్గసీమలాంటి తన గృహంలో, భర్త అనురాగానికి ఆనందిస్తూ, పసిపాపల బోసినవ్వులకు పరవశత్వం చెందుతూ స్వర్గ

సౌఖ్యం అనుభవించే దానికంటే స్త్రీకి అదృష్టమేముంది? అందుకనే అమరకవి టాగూరు "ఓ స్త్రీ! నీవు గృహపరిచర్యలలో మసలుతున్నప్పుడు నీ శరీరాంగములు గులకరాళ్లనడుమ సెలయేరువలె గానం చేస్తాయి" అన్నాడు.

స్త్రీలకు ఆస్తి హక్కులు వుండాలి. పిత్రార్జితంలో కొడుకుతోపాటు కూతురికి కూడా భాగం వుండాలి. మృతభర్త యొక్క స్థిరచరాస్తులు భార్య బ్రతికున్నంత వరకూ అనుభవించటానికి హక్కు వుండాలి.

ఆధునిక స్త్రీలలో చాలామంది గృహకృత్యాలు నిర్వహించటం గౌరవ లోపంగా భావిస్తారు. తిని కూర్చోడంవల్ల అనారోగ్యం పాలవుతున్నారు. పూర్వపు స్త్రీలు దంపటం, నీళ్లు తోడటం, విసరటం మొదలైన కాయకష్టాలుచేసి సంపూర్ణారోగ్యంతో దీర్ఘకాలం బ్రతికేవారు. అందువల్ల గృహకృత్యాల్లోపాల్గొని ఆరోగ్యం అభివృద్ధిపర్చుకోవాలి.

సాంఘిక శకటానికి స్త్రీ పురుషులు రెండు చక్రాలవంటివారు. ఏ చక్రంలో లోపంవున్నా సక్రమంగా సంఘశకటం పురోగమించజాలదు. స్త్రీలను అధోగతిలోవుంచి సాంఘికాభ్యుదయాన్ని ఆకాంక్షించడం అవివేకం. అచిరకాలంలోనే ఆధునిక హైందవ స్త్రీ పురుషునితోపాటు సమాన గౌరవస్థానం సంఘంలో అలంకరిస్తుందని ఆశిద్దాం.

---



# పొంతలు

శ్రీమతి Kంగాధరభట్ల

అది వెన్నెలరాత్రి. చంద్రుడు తన కిరణాలను పాల్పైపులా ప్రస రిస్తున్నాడు. చంద్ర కిరణాలు చూచి భూమి నవ్వుతుందేమోన నిపిస్తూంది. సుశీల చంద్రకాంతిని చూచి ముకిసిపోయింది కాని ఆమె ప్రాణపతి అక్కడ లేనం దున ఆమె ముఖం ముడిచుకుంది. ఒక్క క్షణంలో ఆమె సంతోషం మటుమాయమైంది. మనసును స్త్రీపర్చటాన్కి కవి "ఉమర్ ఖయ్యాం" వ్రాసిన "మధుకలశం" తీసింది. "నవ్వినా నిన్నటికోసం పుట్టబోయే రేపటికోసం ప్రాకులాడ వద్దు" కాదు మహానుభావుడు. యౌవ్వనం శాశ్వతం కాదు. అది మరణించేలోగా జీవితంలోని ప్రమోదాలు మాధుర్యాలని, ప్రియురాళ్ళు చేతిమీదుగా తనివితీరా త్రాగమంటాడు." ఎంతచక్కగా చెప్పాడు మహాను భావుడని అనుకొంటూంది. సుశీల తన చూపుల్ని మబ్బుకమ్మిన ఆకాశం నేపు చూచేలాగ ఆమె తన భర్త రాకను ఎదురు చూస్తూంది. తన భర్త ప్రియవదనం ఎప్పుడూ ఎదురుగా నుండాలని, ప్రియవచనాలు విన టాన్కి ఎప్పుడూ కోరేది.

నదులు వచ్చి సముద్రంలో కలియటం, వికసించిన పుష్పాలమీద తుమ్మెదలు వ్రాలటం యిలాంటి దృశ్యాలు ఆమెకు చాల సరదా.

పూర్ణచంద్రుడు ప్రత్యక్షమయి రెండు గంటలు య్యింది. సుశీల తన భర్తను ఆ రోజు పేగరం రమ్మ న్నది. ఆమెకు వెన్నెల భోజనం అంటే సరదా. ఏడ్గంటకల్లా వంటా, పూర్తయింది, ఫలహారాలు తయారయాయి. ప్రతిదినం వేళకువచ్చేవాడు ఆ దినం యింకా రాలేదు. తను సంతోషంగా చేసిన ఏర్పాట్లకు ఏమిఅడ్డు తగులుతుందని దిగులుపడుతోంది

సుశీల. యిరుగుపొరుగువారు ఒకరి తర్వాత ఒకరుగా యిళ్ళకు చేరుకొంటున్నారు. ఎనిమిది గంటలు కొట్టేరు కాని రావు యింకా రాలేదు.

నేను వెన్నెల భోజనం వండిన్నాడే వీరు ఆలస్యంగా వస్తారు. అన్నీ చల్లారిపోతున్నయి. నిద్ర కూడా వస్తూంది. పదిగంటలకు భోజనానిక్కూర్చొని "ఛా! ఏమిటివి? అప్పడాలు వేయించటానిక్కి బదులు వేడినీళ్ళలో నానవేశావా?" అని లోటుపాట్లు ఎంచుతూ కూర్చుంటారు. ఈయనగారి సంగతి తెలిసిందేగా? అని చికాకుగా తనలో సణుగుకొంటూ పడకగదిలోకి తిరిగివెళ్ళి పక్కలుసర్ది నాల్గు సాంబ్రాణివత్తులు వెలిగించి నిలువుటద్దంలో తన అందాన్ని సర్దుకొని, వాకిట్లో యీజీ ఛైరులో కూర్చొని చంద్రభగవానుని శీతల కిరణాలక్రింద హాయిననుభవిస్తూంది. యింతలో తలుపుతట్టిన శబ్దం విని తలుపుతీసింది. రావుని చూడగానే చరచరామని వంటింట్లోకిపోయి కుంపటిమీదనున్న వంటకాలు వాకిట్లో తెచ్చిపెట్టి వెండికంచంలో వడ్డనచేసింది. సంతోషంగా మాట్లాడుకొంటూ భోజనం చేద్దామనుకొన్న సుశీల ఆశ నెరవేరలేదు. భోజనాలు మౌనంగా పూర్తయినాయి. సుశీల ముఖంలో వెలిగే కోపజ్వాలల్ని చూచాడు "రావు". అంచేత అతనూ మౌనంగా ఉన్నాడు. భోజనమయ్యాక రావు యీజీఛైరులో కూలబడ్డాడు. పళ్ళెంతో తాంబూలంతెచ్చి ముందరపెట్టి నిల్చుంది సుశీల. అప్పుడుకూడా రావు నోరు తెరవలేదు. సుశీల మౌనంగా మరి ఉండలేకపోయింది.

"ఇటువంటిరోజుల్లో మీరు ఆలస్యంగా రావటానిక్కే నిశ్చయించారా?" అన్నది సుశీల.

"అవును" అన్నట్టుగా తలూపాడు రావు.

"ఏమిటి అవునా?" అంది సుశీ.

"ఏమిటి అవును అంటే నాకర్థంకాలే"దన్నాడు రావు.



"యింతసేపటిదాకా ఆఫీసులోనే ఉన్నారా?"

"లేదు" అన్నాడురావు అర్థనిమీలిత నేత్రాలతో.

"మరి?" అంది సుశీల.

"మరి అంటే ఏమిటో"దన్నాడు చిలిపిగా.

సుశీల మాట్లాడలేకపోయింది. కోపం మాత్రం యినుమడించటంవలన చరచరా వంటింట్లోకిపోయి గ్లాసుడుపాలు తెచ్చి అతని ముందుపెట్టి పడకగదిలోకి పోయి పడుంది. రావు ఆ గ్లాసు పాలతో ఆమెను అనుసరించాడు. మేజాబల్లకు ఎదురుగానున్న కుర్చీలో కూర్చొని ఆమెవేపు తన దృష్టిని పోనిచ్చాడు.



"మీ ప్రవర్తన నాకనుమానంగాఉంది" అంటూ లేచి కూర్చుంది సుశీ.

"ఏమి" అన్నాడు రావు ?

"ఆఫీసు 5 గంటలకు అయిపోతే రాత్రి పది గంటలవరకూ ఏంచేస్తున్నారు ? ఎక్కడ తిరుగుతున్నారు ? ఎవరితో పొద్దుగడుపుతున్నారను కొనేది ?"

"ఎవరితో ఎక్కడ తిరుగుతున్నానని నీ సందేహం ?"

"అదే నేను అడుగుతూంట"

"నన్ను చూస్తే సందేహించాల్సిగానేఉందా ?"

"అది సరేకాని, మీరు చదువుకొంటున్నప్పుడు ఏ యువతైనా మిమ్మల్నిచూసి ఆశపడిందా ?" అంది సుశీ.

యీ ప్రశ్న సుశీ నోటంట వినగానే తనలో నవ్వుకొని "అబద్ధం ఎందుకు చెప్పాలి, నిజమైన సంగతి చెప్తావిను. ... ... మీనాక్షి అనే అమ్మాయికి ఆశ కలిగినమాట నిజమే ! కాని ఆ ఆశ నిరాశ అయింది" అన్నాడు రావు.

ఆమాట వినగానే సుశీకి తేలు కుట్టినట్టయింది.

"నా సందేహం నిజమే నన్నమాట ? ఇప్పుడిప్పుడే మీ బండారాలు బైటపడుతున్నాయి. ఆమె ఎవరు ! ఆమె కథ చెప్పు"ని హెచ్చరించింది రావుని.

"చెప్పబోతే కథలాగనే ఉంటుందికాని అది గావు కనుక చెప్తావిను" అని ప్రారంభించాడు రావు.

నేను కాలేజీలో చదివే రోజుల్లో జరిగిన సంఘటన. ప్రతిదినం ట్రాములో కాలేజీకి పోతూండేవాడిని. ప్రతిరోజూ మీనాక్షికూడా ఆ ట్రాములోనే వచ్చేది. ఆమె చేతులోని పుస్తకాలుబట్టి "లా" చదువుతూందని తెల్సుకొన్నాను. ప్రతిదినం ఒకే ట్రాములో కలుసుకొని వెళ్తూండడంచేత మాకు ఒక విధమైన పరిచయం కలిగింది. ఎప్పుడైనా ఆ ట్రాములో ఆమె రాకపోతే దాన్ని తప్పి రెండో ట్రాం కోసం కాచేవాడిని. ఒకనాడు "Wedding" కార్డులు ఆమె చేతిలో చూచాను. వాటిని చూడగానే నా మనసులో ఎందుకో బాధ కలిగింది. నేను వాటిపైపే చూస్తూండటం తెలుసుకొని గారవార్థం ఓ పత్రికతీసి, "మా తమ్మునికి వడుగు చేస్తారు" అంటూ యిచ్చింది. ఆ మాటలు విన్న తర్వాత నా మనసుకు శాంతి కలిగింది.

"అలానా ? మీకే వివాహం జరగబోతోందేమోనని" అనుకొన్నాను. అని నవ్వుతూ ఆ వడుగు పత్రికను అందుకొన్నాను.

"నేను వివాహం చేసుకోను. నా జీవిత లక్ష్యం వేరు. రాబోయే రాజ్యాంగంలోచేరి ప్రజల ప్రతినిధిగా శాసనసభల్లో వారికి సేవచేయదలచాను" అంది మీన.

"నీ కోరిక నెరవేరకూడదు. నీ ఆశ నిరాశ కావాలి. నిన్ను విహాహం చేసుకొని ఈ జీవితాన్ని నడపాలని నా ఆశ" అని నాలో నేను అనుకొన్నాను.

"ఏమన్నారూ ? ... మరోసారి చెప్పండి. అనుకోరామరి ? బాగానే అనుకొంటారు !" అంటూ సుశీల రావుమీద ఒక పిడుగు వదిలింది.

"అలా కంగారుపడతావేం ? యిది మన వివాహానికి పూర్వం జరిగినదన్నమాట మరవకు. ఇప్పుడు ఎవరినైనాచూచి అలా అనుకొంటానా" అని సమాధాన పరచాడు రావు. తిరిగి కథ చెప్పడం ప్రారంభించాడు.

"మా యిద్దరి ఆశలూ నెరవేరలేదు. ఒకనాడు మీనాక్షి మొఖం వాడిఉంది. ఒకవేళ ఒంట్లో బాగులేదేమో ననుకొంటి. ఈ వేళ అదోలా ఉన్నావేం అనిఅడిగాను మీనాక్షిని. వెంటనే ఆమె కళ్లంట జలజలమంటూ కన్నీరు కార్చింది. ఆమె యిష్టానికి ప్రతికూలంగా మేనమామ కొడుకుతో సంబంధం స్థిరపరిచారట. ఆ మాట వినగానే భరించరాని

మనోవ్యధతో కృంగిపోయాను. నా మనోవాంఛను ఆమెకు తెలుపకుండా ఉండలేకపోయాను. నా హృదయాన్ని విప్పి చెప్పాను.

"మీనా నిజాన్ని దాచడ మెందుకు? నీ పరిచయం నాటినుండి యిన్నాళ్లుగా నాలో ఏ కోర్కె బాధ పెడుతూంది నీకు తెల్సునా" అని జాలిగా అడిగాను.
"తెల్సును, పురుష ప్రాణులు. అందులోనూ మీలాంటి బ్రహ్మచారులు హృదయంలో తహతహ లాడించే కోర్కెలని స్త్రీ హృదయాలు అవలీలగా గ్రహిస్తాయన్న సంగతి మీకు తెలియదూ?" అంది.

ఈ ప్రశ్నవలన ఆమె మనోభావంకూడా నాకు విశదమయింది. నాకు తొట్రుపాటుకూడా అధిక మైంది.

"ఈ వివాహాన్ని ఆపడం నీవలనకాదా?"
"అది కలలోనిమాట. మా తండ్రి చాల పట్టుదల మనిషి" అన్నది.

మీనాక్షి వివాహం అలాగే జరిగి తీరింది. వివాహ మయిన మర్నాడే ఆమె కళాశాలకు వచ్చింది. ఆమెను చూడగల భాగ్యం చిక్కినందుకు నాలో నేను సంతోషించాను. రెండువారాలకుముందు ఆమె ముఖమండలంలో ప్రకాశించినకాంతి మలిన మైంది. దుఃఖరేఖలు వెలుగుతున్నాయి. ఆమె విచార స్వరూపాన్నిచూచి నాలో నేను దుఃఖించాను.

ఒకనాడామెను మార్గ మధ్యంలో ట్రాంలోంచి దింపి:—

"అయిష్టమయిన వరుణ్ణి వివాహమాడి జీవిత నావను దుఃఖసాగరంలో నడపటానికి తీర్మానించావా మీనా"

"గత్యంతరం? నా తల్రాత అలా ఉంది కాబోలు" అంటూ తన విశాల నేత్రాలతో నా వైపు జాలిగా చూచింది.

"... ... ... వాస్తవంగా చెప్తున్నాను. నువ్వు వస్తానంటే చెప్పు. ఈ రోజు రాత్రే యిక్కడనుండి కలకత్తాకుపోయి అక్కడనుండి సింగపూరు ఓడ ఎక్కుదాం" అన్నా ధైర్యంగా.

"సరేనంటూ" తలూపింది మీన.

(రావు అలా చెప్తూంటే సుశీల తీవిగా సర్దుకు కూర్చొని) చాల ఆశ్చర్యంగా ఉందే! మీరు చెప్పే కథ నా కథలాగుందే అన్నది ఆశ్చర్యంగా.

"నీ కథా?" అన్నాడు రావు.

"అవును వినండి" అని చెప్పడాన్కి మొదలు పెట్టింది సుశీల.

"మన వివాహాన్కి పూర్వం నేనూ ఒకాయనను ప్రేమించాను. నా మాట లక్ష్యపెట్టకుండా మీకిచ్చి వివాహం చేశారు. అప్పటికీ నా స్నేహితుడు నన్ను విడువలేదు. ఒకనాడు ఒంటరిగాకలసి నన్ను ఏమం టావు సుశీలా? నాతో వచ్చేయరాదూ? సింగ పూరుపోయి హాయిగా మన జీవిత రథాన్ని నడుపుదాం అన్నాడు. నేనూ సరే నన్నాను."

"సరేనని ఒప్పుకొన్నావా?" అన్నాడు రావు.

"వివాహమయిన ఒక అమ్మాయిని నాతో లేచి వస్తావా? అని మీరు అడగవచ్చుగాని, నేను సరే నని ఒప్పుకోడం తప్పా?" అని సమాధానం చెప్తూ తన కథ ప్రారంభించింది.

ఆ రోజు రాత్రి కలకత్తాకుపోయే మెయిలువద్దకు నా చిన్న తోలు సూటుకేసుతో చేరాను. అక్కడ నా కన్న ముందువచ్చి ఎదురు చూస్తున్నాడు నా స్నేహితుడు దాసు.

"దాసా?" అన్నాడు రావు ఆశ్చర్యంగా.
"అవును అతనిపేరు దాసు."

నన్ను చూడగానే అతన్కి కల్గిన సంతోషాన్కి

అంతులేదు. "ఎక్కడరాకపోతావోనని సందేహించాను" అంటూ అతనిలోని సందేహాన్ని వెలిబుచ్చాడు దాసు.

"రైల్లో ఎక్కి కూర్చున్నాం. రైలు బయలుదేరటానిక్కి ఒక గంట టైముంది. అప్పుడు నేను ఆలోచనా రాజ్యంలో పడ్డాను. వివాహమాడినదాన్ని యిలాటిపని చేస్తున్నానే యిది మంచిదేనా?" అని నా అంతరాత్మను ప్రశ్నించాను.

"ఇది తప్పుడు త్రోవ. పెద్దమోసం మహాపాపం!!" అని నా అంతరాత్మ ఘోషపెట్టింది.

"నా గుండెల్లో దడపుట్టింది. శరీరం వణకనారంభించింది. నాలో యీ మానసిక మార్పును దాసు గుర్తించాడు."

"నీ వంట్లో బాగులేదా?" అన్నాడు దాసు.

"ఏమీలేదు. అలసటగా ఉంది. కాఫీ కావాలన్నాను."

వెంటనే అతను రైల్లోంచి దిగి పరుగెత్తాడు. అతను నా దృష్టి తప్పాడు. నేనూ రైలుదిగి ఎవరూ చూడకుండా గబగబా స్టేషను ఆవరణదాటి రిక్షాలో యింటికి వచ్చాను. తర్వాత నాల్గురోజులు గడిచాయి. దాసువద్దనుండి జాబువచ్చింది." అన్నది సుశీల.

రావు కొద్దిగా సర్దుకొని "ఏమని వ్రాశాడో నాకు తెలుసు. నే చెప్తా విను."

సుశీలా!

మనం గొప్ప అపచారం చేయదలచాం. భగవంతుడు తప్పించాడు. అగ్నిసాక్షిగా వివాహమాడిన నీ భర్తతో గడపడమే ధర్మం. ఇష్టంలేకపోయినా అది నీ విధి. హిందూ స్త్రీకి అదే పెట్టని ఆభరణం అనే ధర్మ సూత్రాన్ని రైల్లో కూర్చున్నాక గుర్తించాను. నన్ను కాఫీకొరకు పంపావు. అప్పుడు తిన్నగా యింటికే వచ్చేశాను. నీవు నాకొరకుచూచి, రైలు కదిలేటైము అయినా నేను రాకపోవటం నా మీద కోపగించి యిల్లు చేరుకొని ఉంటావని యీ జాబు వ్రాస్తున్నాను. నన్ను క్షమించి శాశ్వతంగా నన్ను మరిచిపోయి నీ భారత స్త్రీత్వాన్ని నిలుపుకొంటావని హెచ్చరిస్తున్నాను,

ఇట్లు, దాసు.

అని వ్రాసివుందికదూ? అన్నాడు రావు.

"ఉండొచ్చు: మీరు ఆరున్నర గంటల ఆట చూచుకొని యీ వేళకు యిల్లు చేరుకొన్నారు కనుక ఒక్కమాటైనా మరచిపోకుండా వప్పచెప్పారు. నేను మేటినీకి వెళ్ళాను. అంచేత నాకు అంతగా జ్ఞాపకం లేదు" అని నవ్వుతూ జవాబిచ్చింది సుశీల.

"నేను సినీమాకువెళ్తే నెలకెన్ని సినీమాలు చూస్తారు? యిన్నిసార్లువెళ్తే కళ్ళు ఏమవుతాయి? అని పేచీ పెడతావు. నువ్వు మాత్రం ఏంచేస్తున్నావు? ఒక్కదానికైనా తప్పకుండా మేటినీలు చూచి నేను ఆఫీసునుండి వచ్చేసరిక్కి యింట్లో సిద్ధంగా ఉంటున్నావు. ఈ రహస్యం యీ రోజు బైటపడింది" అని నవ్వుతూ రావు అన్నాడు.

"నేను అలా వెళ్ళిచూసి రాకపోతే మీరు చెప్పే కథలన్నీ నిజమనే నమ్మాలి" అంటూ నవ్వుతూ జవాబిచ్చింది సుశీ. ఇద్దరూ నవ్వుకుంటూ వాకిట్లో వెన్నెల్లో కూర్చుని, శీతల చంద్రుని చల్లదనంలో రావు బాహుపంజరంలోకి వ్రాలింది సుశీల.



# నొప్పితో అవస్థనా?

# "నోపెయిన్"

దానిని వెంటనే గుణపఱచును.

ఒక కలకత్తా కెమికల్ తయారింపు

మద్రాసు ఆఫీసు : 5/149 బ్రాడ్వే, మద్రాసు 1.




'నారపీచు'

పిలానీలో సెంట్రల్ ఎలక్ట్రానిక్ ఇంజనీరింగ్ రిసెర్చి ఇన్‌స్టిట్యూట్‌కు ప్రారంభోత్సవముచేస్తూ పండిత నెహ్రూ వైజ్ఞానిక పరిశోధనాపథంలో పురోగమించడం దేశాభ్యుదయానికి రాచబాట అని ఉద్బోధించారు.

పండిత నెహ్రూగారి మాటలు మనదేశానికి మాత్రమే ఉద్దేశించబడినవిగావు. యావత్ప్రపంచానికి అనుసరణయోగ్యంకావలసినవి. వైజ్ఞానిక పరిశోధనాపథంలో పురోగమనము మానవశ్రేయస్సుకు, అభ్యుదయానికి మాత్రము వినియోగపడిననాడు ప్రపంచంలో శాంతి సౌభాగ్యాలకు కొరవయుండదు.

♦ ♦ ♦

"నూతన రాష్ట్రాలకోసరం ఆందోళన తగదు" అని కాంగ్రెస్ వర్కింగ్‌కమిటీ హెచ్చరించింది. ఈ హెచ్చరికను భారతప్రజానీకం ఎలా స్వీకరిస్తుందో గమనించతగిన విషయము.

నూతన రాష్ట్రాల నిర్మాణానికిజరిగే ఆందోళన భాష, సంస్కృతి, పరిపాలనా వ్యవహారములలో తమకు అభ్యుదయముతోబాటు న్యాయం జరుగాలనే ఉద్దేశం, ప్రాతిపదికతో వివిధభాషా ప్రాంత్యాలు జరుపుతున్నవి. ఇట్టిభాషా రాష్ట్రనిర్మాణం దేశంలో ఐకమత్యం, పరిపాలనా సౌలభ్యం, పురోభివృద్ధిని సమకూర్చే పరిస్థితులలో నూతన రాష్ట్రాల నిర్మాణము అవాంఛనీయం, అనవసరమని కాంగ్రెస్ వర్కింగ్ కమిటీ హెచ్చరించడం తొందరబాటును మాత్రమే సూచిస్తున్నది.

♦ ♦ ♦

కొరియాలో శాంతి స్థాపన అత్యవసరమని ప్రపంచములోని దేశాలన్నీ గుర్తించినవి. కాని సుస్థిరమైన శాంతి స్థాపనకుచేసే ప్రయత్నాలలో అగ్రరాజ్యప్రతినిధుల మనస్తత్వాలు మాత్రము అడుగడుగుకూ శంకించవలసినదిగా నున్నవి.

రాజకీయ సిద్ధాంతాలు ఏవైనా త్రికరణశుద్ధిగా శాంతిని అభిలషించే నవచైనా, ఇండియాలాంటి దేశాలకు శాంతి స్థాపన చర్చలలో ఉచిత స్థానము లేకపోవడం విచారకరం.

♦ ♦ ♦

సేవింగ్స్ ఉద్యమానికి స్త్రీల తోడ్పాటుకుగాను విశేషంగా ఆంధ్రదేశంలో సయితము ప్రచారము జరుగుచున్నది. ఇట్టి ఉద్యమం మూలంగా దేశ పురోభివృద్ధి కార్యక్రమాలు తమ స్వంత డబ్బుతోటి ప్రజలు స్వయంగా నిర్వహించకలుగడం వాంఛనీయమేకాకుండా ప్రోత్సహించవలసిన విషయం కూడా.

♦ ♦ ♦

ప్రపంచంలో ఏర్పడే పరిణామాలు మంచివి, చెడ్డవి రెండూయున్నవి. జీవిత పర్యంతం ప్రపంచంలో ఉన్నవాడు ఉన్నట్లు భోగభాగ్యాలతో విలాస జీవితం గడుపుతూ, లేనివాడు లేనట్లు పస్తుపండుకొని చావవలసినదే అనే ధోరణిని ఎవరూ ఆమోదించరు యీనాడు.

సంఘంలో ప్రతి వ్యక్తికీ ఎలాగ కొన్ని గురుతరమైన బాధ్యతలున్నవో, న్యాయ సమ్మతమయిన హక్కులుకూడ కలవని గుర్తించి పురోగమిస్తున్నాడు. ఆకలి దప్పులనుండి, అవిద్యా దారిద్ర్యములనుండి తాను కాపాడబడి, నలుగురితోబాటు సుఖంగా జీవయాత్ర గడుపడానికి అవసరమయిన సదుపాయాలను సమకూర్చడం సంఘంయొక్క ముఖ్యధర్మమనేది సర్వాంగీకారం. అంటే ఒక ప్రక్క కొందరు మహద్దశ ననుభవిస్తూ మరొకప్రక్క కూటికి గుడ్డకు కరువై కొందరు ఘోర దారిద్ర్యము ననుభవిస్తూ ఉండటం కూడదనే సిద్ధాంతము ప్రాబల్యములోనికి వచ్చింది. ఇందుకు కారణం ప్రజలలో ఏర్పడిన, ఏర్పడుతున్న నవచైతన్యమే కారణం. ఈ చైతన్యాన్ని అరికట్టాలని ఏ దేశంకాని, జాతికాని ప్రయత్నిస్తే పరాజయం తప్పదు.

ఈ సందర్భంలో 'సర్వమానవ సమత్వము' అనేది సాధ్యమయినా సాధ్యము కాకపోయినా భాగ్యానికి, దారిద్ర్యానికిగల విపరీతమైన భేధాన్ని తగ్గించడానికి మాత్రము ప్రపంచంమొత్తముమీద ప్రయత్నాలు అవసరము. ఇందుకుగాను ప్రపంచములోని అన్ని దేశాలలోను ప్రయత్నాలు జరుగుతున్నవి. ఇట్టి ప్రయత్న పూర్వకమైన పద్ధతులలో మనదేశంలో విధింపబడనున్న ఎస్టేటు సుంకాలు లేదా మరణ సుంకాలు ఒకటి.

ఎస్టేటు సుంకాల బిల్లు మూలంగా అమలులోనికి రాగల సంస్కరణ భారతజాతి పురోభివృద్ధికి తోడ్పడగలదు.

♦ ♦ ♦

జీవిత పరమార్థములలో మానవుడు కృతజ్ఞతను వెల్లడించడము ఒకటి. ఆ కృతజ్ఞతను వెల్లడించడములోకూడ రెండుమార్గములున్నవని ఒక అమెరికను కవీశ్వరుడు వివరించాడు.

వస్తు, ధన రూపములుగా యితరులవలన తాను పొందే సహాయానికిగాని, యితరులు తమ నుద్దేశించి మానసిక సంబంధమైన సానుభూతి, అభినందనలను వెల్లడించినపుడుగాని చేకూరే మనశ్శాంతి, ఆనందాలకు ప్రతిఫలంగా వెల్లడించేది ఒక మార్గం.

రెండవది తాముచేసే సహాయాన్ని, కష్టసుఖాలలో తాము యితరుల నుద్దేశించి వెలిబుచ్చే సానుభూతి, అభినందనలను అందుకొనిన వారనుభవించే తృప్తిని, మనశ్శాంతిని చూచినప్పుడు పొడచూపునది. పుచ్చుకొనుటలోకన్న యియ్యగలుగుటలో విశేషమైన ఉత్సాహం చూపడం వలన కలిగే ఆనందం పరమోత్కృష్టమైనది. మానవ హృదయము యిట్టి కృతజ్ఞతా నిలయమయినప్పుడు జీవితమంతయు మధుమయమగునని ఆర్యోక్తి.

♦ ♦ ♦

ఆంధ్ర మహిళాసభ పారిశ్రామికసంస్థ నూతన భవనంలో కార్యక్రమానికి ఆంధ్ర గవర్నరుగా నియమించబడిన శ్రీ త్రివేది 23.9.53 సాయంకాలము ప్రారంభోత్సవము చేశారు.

ఈ సందర్భమున శ్రీ త్రివేదిగారు తీరిక సమయాలలో స్త్రీలు సాంఘిక సేవ చెయ్యడానికి పూనుకొనవలెననియు, సంఘసేవ చేయడంలో ఎక్కువగా స్త్రీలు ముందంజవేయకపోవడానికి పురుషులే కారణమన్నారు.

పైమాటలు పైకి బహు చక్కగా కనుపించినా అవి వాస్తవిక పరిస్థితుల దృష్ట్యా నారీలోకాన్నంతటిని ఉద్దేశించి పలికినవికావు.

తీరికగల మహిళలను పురుషులు సంఘసేవనుండి నిరోధించడముగాని, ప్రోత్సహించకుండటముకాని లోపమే. కాని అట్టి తీరికగల సంపన్న కుటుంబాలు బహుకొద్ది. మిగిలినవి వచ్చే ఆదాయం చాలక, దైనికావసరములు గడుపక దినగండం నూరేళ్లాయుస్సుగా నుండేవి. అట్టి కుటుంబాలలోని మహిళలకు తీరిక అనేదికాని, సంఘసేవ చేయాలనే ఆసక్తికాని ఎలా సాధ్యం? 'ఇంటగెలిచి రచ్చగెలువ'మన్నారు పెద్దలు. కుటుంబ ఆదాయం పెరగడానికి వసతులు ఏర్పడి తాను, తన కుటుంబం సుఖంగా జీవయాత్ర చేయకలిగిననాడుకాని మహిళలు సంఘ

సేవలోనేకాదు సకల ప్రజాహిత కార్యకలాపాల లోను పాల్గొనజాలరు.

విద్యావ్యాప్తితోబాటు ఏర్పడినవిజ్ఞాన వికాసము స్త్రీలలోనే కాకుండా పురుషులలో సయితం పరివర్తనం కలుగజేసి విశ్వమానవ కల్యాణానికి తోడ్పడ గలదని గట్టిగా నమ్మవచ్చును.

◆ ◆ ◆

నిరుద్యోగ సమస్యాపరిష్కారానికి పంచవర్ష ప్రణాళిక కొంత దోహదమివ్వవచ్చును. కాని అది చాలవరకు విద్యాధికుల సమస్యకు మాత్రం సంబంధించినది.

ఈ మధ్య కేంద్ర ఆర్థికమంత్రి శ్రీ దేశ్ ముఖ్ స్టేట్సుకౌన్సిల్ లో 1951 - 52లో కంటె 1952 - 53లో వ్యావసాయక పారిశ్రామికరంగాలలో కొంత అభివృద్ధి సమకూరినదని నిరూపించడానికి ఉదహరించిన అంకెలు, నిరుద్యోగము లాంటి సమస్యలు పరిష్కారమయినవనికాని, అగుచున్నవని కాని అనుకోడానికి అవకాశములు కనుపించుటలేదు.

నిరుద్యోగ సమస్యాపరిష్కార సందర్భమున గుర్తించవలసిన విషయాలలో యంత్ర సహాయంతో నిర్వహించే భారీ పరిశ్రమలు పరిమితంచేయబడి కుటీర పరిశ్రమల అభివృద్ధిని ప్రోత్సహించడం ప్రధానమయింది. అందుకుగాను ఏఏ ప్రాంతాలలో ఏఏ పరిశ్రమల నెలకొల్పడానికి అవకాశమున్నదోననియు, ఆ యా ప్రాంతాలలోని ప్రజల అవసరాలు, శక్తి సామర్థ్యాలు, ఆర్థిక పరిస్థితిని వివరించగలభోగట్టా సేకరించబడాలి. దాంతోబాటు ప్రాజక్టులు, గృహ, రోడ్ల నిర్మాణం, సాగుబడికి అనువైయుండికూడ బీళ్లుగానున్న సారవంతమయిన భూమిసాగుకు లేవడం, ఆహారధాన్యాలపంటలు, ఫలవృక్షాలు, కాయగూరలతోటల పెంపకం ప్రోత్సహించడం మొదలయిన కార్యకలాపాలను ప్రభుత్వము ఆర్థికంగాను, నైతికంగాను ప్రోత్సహించాలి. అనాడుకాని నిరుద్యోగ సమస్యా పరిష్కారం తృప్తికరంగా సమకూరదు.

అఖిల భారత కాంగ్రెస్ సంఘంవారి నిరుద్యోగ సమస్యకు సంబంధించిన భోగట్టా సేకరణ, ప్రదేశ సంఘాల ద్వారా జరుగనుండటం మంచిదైనా అధికార, అనధికార సంఘాల ద్వారా ఏకోన్ముఖంగా యీ భోగట్టా సేకరణ జరుగడంవలన సత్ఫలితాలు మెండు.

# స్వామినాథన్

మూలం :
శ్రీ ఆర్. కె. నారాయణ్

★

స్వేచ్ఛానువాదం :
శ్రీ చీమలపాటి సూర్యనారాయణ

[...సెలవుల్లో చదువు సంధ్యలు లేకుండా తిరుగుతూ అల్లరి చేస్తుంటే తండ్రి గదమాయించి కూర్చొనబెట్టి లెఖలు చెప్పడం మొదలు పెట్టాడు. అవి స్వామికి అర్థంకాని పరిస్థితిలో సరియైన సమాధానాలు చెప్పక పోవడంవలన నాలుగు తగలనిస్తే ఏడ్పు మొదలు పెట్టాడు.

సెలవుల అనంతరము స్థానికబోర్డు హైస్కూలులో ప్రవేశ పెట్టబడిన స్వామి స్నేహితులైన రాజం, మణికలసి తర్జనభర్జనలతో యం. సి. సి. అనే పేరున క్రికెటు టీమును స్థాపించి రాజంను కాప్టన్‌గా నిర్ణ యిచారు. బాట్లకు, బంతులకు మద్రాసునందలి 'బిన్స్' కంపెనీవారికి వ్రాసిన జాబులో డబ్బును తర్వాత పంపెదమని వ్రాశారు. ఆ రోజుననే శంకర్ దగ్గరనుండి వచ్చిన జాబుకు మణి ఏమి జవాబు వ్రాయాలో తెలి యక శంకర్ వ్రాసిన జాబును తిరగవ్రాసి పంపాడు. స్వామి, రాజంలు మాత్రం వేరువేరు కాగితములమీద ఒకే విధంగా తమక్రికెటు టీమును గురించి వ్రాసి తమ టీము శంకర్ ఆడుతున్న టీముతో పోటీ చేసేందుకు సిద్ధముగానున్నదని తెలిపి తమ తమ సంతకాలతో పంపారు. 'బిన్స్‌కంపెనీ' వారు యం. సి. సి. వారికి వ్రాసిన జాబులో వారికి కావలసిన బాట్సు, బంతులక్రయములో 25%ను ముందుగా పంపిననేకాని పంపజాలమని వ్రాసినది అర్థముకాక స్వామి, మణి, రాజంలు వాదులాడుకుంటున్నారు — యికచదువండి.]

(గతసంచిక తరువాయి)

చివరకు ఆ ముగ్గురూ ఒక నిర్ణయానికివచ్చి, యీ వుత్తరం తనకు పొరపాటున పంపబడ్డాదని, తిరిగి రాజం బిన్సు కంపెనీకి వుత్తరాన్ని పంపివేశాడు !

ఆ వుత్తరంలో.

'అయ్యా, పైవారు త్తరం మాకు పంపబడ్డాదని చెప్పుటకు చాలా విచారిస్తున్నాము ; పైవారు త్తర మును మీకు తిరిగి పంపడమయింది ; కాబట్టి-మేము కోరిన సరుకులను వెంటనే పంపవలెను' అని వ్రాయc బడింది !

## ౧౬

స్వామి అశ్రద్ధను ఆక్షేపిస్తూ—

“స్వామీ, నీ కొక హెచ్చరిక చెబుతున్నాను. గేము ఆడేందుకు నువ్వు బద్ధకపడుతున్నావ్. యీ క్షణంవరకు నీవు ప్రాక్టీసన్నదే లేదు!” రాజం అన్నాడు!

“వెధవది మా బోర్డు స్కూలు వర్కునుండి వచ్చేందుకు తీరుబడిలేకుండావుంది రాజం!”

“బొట్టూ, కాటికాపెట్టి ఆ స్కూల్లో ప్రవేశించమని యెవరు యేడ్చారు చెబుదూ? సరేలే. అయితే - నేను నీ కొకటి చెప్పవల్సివుంది. మన ప్రతికక్షదార్లు సాయంత్ర సమయమందు షుమారు 4, 5 గంటలు ప్రాక్టీసు చేస్తున్నారు; కానీ నువ్వు యేనాడూ ప్లేగ్రౌండుకు వచ్చిన పాపాన బోలేదు; వాళ్ళకన్న నువ్వు గొప్పవాడిననుకున్నావా?” అని రాజమ్ అన్నాడు.

“రాజమ్, నా గోడు కాస్త ఆలకించు; నాశాయశక్తులా ప్రయత్నించి సాయంత్రం గ॥ 5 లకు ప్లేగ్రౌండుకు వస్తాను! వెధవది, యీ డ్రిల్లు తరగతులునుండి రావీలు లేకుండా వుందయ్యా!” స్వామన్నాడు.

“అయితే - వో పనిచెయ్. మీ హెడ్మాష్టరు దగ్గరకువెళ్లి, పరిస్థితులను వివరించి, సాయంత్రం వేగిరంగ విడిచిపెట్టేలా చూడమను.”

“అమ్మో, హెడ్మాష్టరు దగ్గరకు వెళ్ళడానికి నాకు చాలా భయం. వెళ్ళి అడిగానన్న కోపం తన మనస్సులో వుంచుకొని, నన్ను సంవత్సరాలుకొద్దీ రెండవ ఫారంలో వుంచేస్తాడు!”

“సరే, నీకంత భయంగావుంటే, నేనుపోయి మాట్లాడుదునా?” రాజం ప్రశ్నించాడు.

“నిన్ను బ్రతిమాలుకుంటాను, ఆ పని మాత్రం చెయ్యబోకు రాజం! ఇటువంటివి తనికి నచ్చవు!”

“నీ వుద్దేశ్య మేమిటయ్యా? నీ బుర్ర చాలా తిరకాసుగావుంది! రెండు మాసములు కావస్తూంది మన టీము ప్రారంభించి; పట్టుమని పదిరోజులైనా నువ్వు ఆడేందుకు రాలేదు!...” రాజం అన్నాడు.

కాంపౌండు గోడ కానుకొని నిలబడివున్న మణి.-

“సరే, మీ హెడ్మాష్టరు యేంచేస్తాడో చూద్దాం. అయితే ‘అవు’నంటాడు, లేకపోతే - ‘కా’దంటాడు; యింతేనా?” అన్నాడు.

ఆ మర్నాడు హెడ్మాష్టరుతో మాట్లాడేందుకు రాజమ్, స్కూలుకు వచ్చాడు. తనారోజు స్కూలుకు వెళ్లనప్పటికీ లక్ష్యపెట్టటంలేదు! రాజంవెంట మణిగూడా వున్నాడు!

“నువ్వు చాలా విచిత్రపు వెధవలా వున్నావ్! యింత ఆలస్యంగా వచ్చావే?” రాజం ప్రశ్నించాడు.

“నువ్వు హెడ్మాష్టర్ను చూశావా, రాజమ్?” స్వామి అడిగాడు.

“ఇప్పటివరకూలేదు. నువ్వురాందీ నేవెళ్లదలుచుకోలేదు; కాగా - యిది నీ స్వంతపని కదూ?”

రాజం మాటలను పురస్కరించుకొని, స్వామి హెడ్మాష్టరు దగ్గరకు వెళ్ళసాగాడు! మణిని స్వామిజూచి.—“అయితే - మణిక్కడేంజేస్తాడు?” అని రాజంను ప్రశ్నించాడు!

“నాకు తెలీదు!” ముక్తసరిగ సమాధానం జెప్పాడు!

“మణీ, అయితే నీ తరగతి మాటేమిటి జేసావ్?” అని స్వామి మణిని ప్రశ్నించాడు!

“మరేం పర్వాలేదు, ఇవాళ స్కూలుకే వెళ్ళదలుచుకోలేదు” మణన్నాడు!

“నువ్వు స్కూలుకుపోయి, నీ పని చూసుకో

మని, నిన్న నీతోఁ జెప్పలేదయ్యా ?" రాజం అడిగాఁడు !

"నాకు జ్ఞాపకం లేకపోయిందయ్యా !" అన్నాఁడు.

ఆ ముగ్గురూ హెడ్మాష్టరుతో జరుపఁబోయే సంభాషణ గురించి దీర్ఘాలోచనలోపడ్డారు !

"మరేం భయపడకుస్వామీ నీకు యిష్టం వున్నట్లయితే, నేనుపోయి మీ హెడ్మాష్టరుతో మాట్లాడుతా !" అన్నాడు మణి.

"నువ్వు తనగదిలో కాలుపెట్టఁగానే పోలీసును మాత్రం పిలవకమానఁడు, తెలుసా ?" స్వామన్నాఁడు ! ...

రెండు మణుకులను టేబిలుపై ఆన్చి, రెండు చేతుల మధ్యా బుర్రనుపెట్టి, కుర్చీలో గూర్చుని చదువుకుంటున్నాఁడు స్వామి హెడ్మాష్టరు !

కొద్ది నిముషములు బయట వరండాలో ఆ ముగ్గురూ తడ్బాబడి, తరువాత రాజం, స్వామి చిన్నగా పాదాలతో శబ్దం చేసుఁగుంటూ హెడ్మాష్టరు గది లోకి ప్రవేశించారు. వీరిద్దరి వయిపూ కళ్ళు నొకమారు నులుముకొని, కనుబొమలు మీఁద కెత్తి తీక్షణంగ చూడసాగాఁడు.

"మీదేక్లాసయ్యా ? మీ కిప్పుడు యేతరగతి లేదూ ?" అని హెడ్మాష్టరు ప్రశ్నించాఁడు.

"అసలు మీ స్కూలుకు సంబంధించిన వాడినేఁ గాను !" రాజం ఠీవిగా సమాధానం చెప్పాడు.

"ఓఁ ! అయితే - నువ్వే ఆకాశంమీదనుంచి వూడిపడ్డావా ?"

"నేను - 'ఎం. సి. సి.' కి కెప్టెను ! చిన్న పనిమీఁద మీ దగ్గర కొచ్చాను !"

"ఏమిఁటది ?"

"మీ స్కూల్లో రెండవ ఫారం, సి. తరగతి చదువుతూన్న నా స్నేహితుఁడు స్వామినాథన్ ..."

"అలాగా !" అన్నారు.

"నేను-'ఎం. సి. సి.' (మాల్గుడీ క్రికెట్ క్లబ్ !) కి కెప్టెన్ను !"

"చాలా సంతోషం !"

"వీఁడు మా టీములో వున్నాఁడు ; గొప్ప బౌలర్ (Bowler)"

"నువ్వా ? ఆఁ ... హాఁ !" అని స్వామి వైపుఁదిరిగి అన్నారు.

"నేనసలు విషయాన్ని తమతో మనవిచెయ్యమంటారా ?" రాజం అడిగాఁడు.

"చెప్పు—చెప్పు—"

"వీఁడు గొప్ప బౌలరు ; చాలా ప్రాక్టీసవసరం; నాలుఁగున్నర గంటల తరువాత వీణ్ణి స్కూల్లోవుంచి వేయటంచాత ప్లే-గ్రౌండుకు సరియైనవేళకురాకుండా వున్నాఁడు. ..."

"అయితే - నన్నేం చెయమన్నావయ్యా !" హెడ్మాష్టరు ప్రశ్నించాఁడు.

"నాలుగున్నర తదుపరి వీణ్ణి విడిచిపుచ్చేలా తమరు అనుమతించాలి !"

హెడ్మాష్టరు కుర్చీవెనక్కు చేరఁబడి-నిశ్శబ్దంలో మునిఁగిపోయాడు.

రాజం వెంటనే—

"ఏమంటారండి, యీ మాత్రం వుపకారం తమరు చేసిపెట్టలేరూ ?"

"యీ స్కూలుకు హెడ్మాష్టరవు నువ్వా ? లేకపోతే నేనా ?"

"మీరే అనుకోండి ! మా ఆల్బర్ట్ మిషన్ స్కూల్లో నాలుఁగున్నర తదుపరి . మమ్మల్లెవర్నీ

వుంచరు !"

"నేను మీ స్కూలు పొగడ్తలు వినేందు కిక్కడ కూర్చోలేదు !"

తన స్నేహితులు లోనికిపోయి చాలాకాలం అవటంచాత అంతవరకూ వరండాలో వేచియున్న మణి, హెడ్మాష్టరు గదిలోకి వచ్చాడు.

"ఎవరు వీడు ? ... నీకేం కావాలి ?" అని మణి వయిపు చూస్తూ హెడ్మాష్టరు ప్రశ్నించారు.

"నాకేం అక్కర్లేదు !"

"ఏమీ అక్కర్లేనప్పుడు ప్రతీవెధవా నాగదికెందుకు వస్తారో నాకర్థం అవటంలేదు !" అన్నారు.

"నేను-పోలీసు సూపరింటెండెంట్ కుమారుణ్ణి!" ఇప్పుడైనా హెడ్మాష్టరు వొప్పుకుంటాడేమో అని రాజం ఆశించాడు ...

"మీరందరూ యిక గౌరవంమీద బయటకు పొండి !" అని హెడ్మాష్టరొక్కమారు కసరగానే ఆ ముగ్గురూ బయటకు చల్లగా జారుకున్నారు ...

## ౨౦

ఇంకా క్రికెట్ మేచికి నాలుగురోజులు వ్యవధున్నప్పటికీ స్వామిని సాయంత్రం నాలుగున్నర తరువాత విడిచిపెట్టటంలేదు. స్వామిధ్యాసంతా క్రికెట్ ఆటమీద జరుగబోయే మేచిమీద కేంద్రీకరించబడివుంది. స్కూలుకు వెళుతున్నాడేగాని మనిషి మాత్రం దిగాలుగా వున్నాడు.

డ్రిల్లు మాష్టరు స్వామి దగ్గరకు గబగబావచ్చి.—

"నీకు సెలవివ్వనని చెప్పాలా ? ఊఁ - కోటు, టోపీ తీసేయ్ !" అని అరిచారు.

"అయ్యా నేను చాలా అస్వస్థంగా వున్నాను. యీవాళ డ్రిల్లు చెయ్యలేను. డ్రిల్లు చేసినట్లయితే నేను చచ్చి వూరుకుంటాను" అన్నాడు.

"యింతకీ సంగతేమిటయ్యా" అని డ్రిల్లు టీచరు ప్రశ్నించారు.

"అయ్యా నా బాధలేమిటో మీరర్థంచేసుకోకుండా వున్నారు. ఆఖరికి నా బాధేమిటో మీరు అడగటంలేదు !"

"అయితే నీ బాధేమిటో చెప్పరాదూ ?" డ్రిల్లు టీచరడిగారు.

తలనొప్పని చెప్పి తప్పుకుందామనుకున్నాడుగాని, ఆ పరిస్థితులలో డ్రిల్లు టీచరు నమ్మేట్టులేదని స్వామి మనస్సులో అనుకొని.—

"గతరాత్రల్లా 'సంధి జ్వరము'తో బాధపడ్డానండి; యిప్పుడూ బాధపడుతున్నాను" అని స్వామి జంకకుండా చెప్పగానే డ్రిల్లు టీచరొక్కమారు నిలువునా నీరైపోయాడు.

"నువ్వు 'సంధిజ్వరము'తో బాధపడ్డావా ? నీకు మతిగానిపోయిందా యేమిటి ?"

"లేదండీ నిన్నరాత్రల్లా వొక్కమారు కంటికి నిద్దరపట్టలేదు. నిజంగా సంధిజ్వరంతో బాధపడ్డాను ! మా డాక్టరే చెప్పారు. వారంరోజుల వరకు డ్రిల్లు తరగతులకు వెళ్ళొద్దని గట్టిగా శాశించారు. డ్రిల్లు తరగతికి వెళ్ళినట్లయితే చచ్చిపోతానని నొక్కి చెప్పారు !" అని స్వామన్నాడు.

"పోరా వెధవా యిటువంటి వెధవకథలు నా దగ్గర చెప్పకు పో" అని త్రుళ్ళిపడేలా కసిరాడు.

స్వామి ఆయాసంతో ప్లే-గ్రౌండును చేరుకున్నాడు. ఆ గ్రౌండులో అందరూ వుట్టిపడుతూన్న ఆనందంతోను, కేకలు వేసుకుంటూ ఆడుతున్నారు. స్వామినిజూచిన రాజం-సంతోషంలో నొక్కమారు గంతులు వేయసాగాడు.... పూర్తిగా చీకటిపడేవరకు స్వామి, రాజం యింటిదగ్గరే యుండి తరువాత దీపాలు వెలిగించినవేళకు యింటికి పోయాడు.

ఈ డ్రిల్లు తరగతులను తప్పించుకునే నిమిత్తము స్వామి ఆ మర్నాఁడొక పన్నాగము పన్నేఁడు. తన గదిలో 'వ్యాకరణం' చదువుతూఁ గూర్చున్నాఁడు. అప్పుడు - వుదయం గం. 7-30 ల అయింది. ఇంకా తాను స్కూలుకు పోయేందుకు రెండున్నర గంటల వ్యవధుంది ! ...

ఒక షాపుదగ్గర-'డాక్టర్. టి. కేశవన్, ఎల్. ఎం & ఎస్., శ్రీకృష్ణా డిస్పెన్సరీ' అని వ్రాయఁబడి వ్రేలాడదీసిన బోర్డుగల యింటిదగ్గర స్వామి నిలబడ్డాఁడు. వీధివయిఁపు ముఖంబెట్టి పెద్దటేబిలు ముందర డాక్టరుగారుఁ గూర్చున్నారు.

స్వామి, డాక్టరుగారు వొంటరిగాఁ కూర్చున్నట్లు గమనించి షాపులోకి ప్రవేశించాఁడు.

“హాలో స్వామినాథన్ ! వుదయమే యిలా వచ్చావేం ! ”

“ఏమీలేదుసార్. ఓ చిన్నపనిమీఁద వచ్చాను!”

“యింటిదగ్గర అందరూ క్షేమంగా వున్నారా?”

“అందరు క్షేమమే. డాక్టరుగారూ అతివేగిరంగా డాక్టరు సర్టిఫికేటు కావాలి ! ”

“ఎందుకూ ? ”

నేను నిజం చెప్పదల్చుఁకున్నాను డాక్టరుగారూ. 'యంగ్ మెన్స్ యూనియన్'వారితో మరుసటివారం క్రికేట్ మేచి ఆడఁబోతున్నాము. నాకు చాలా ప్రాక్టీసు కావల్సివుంది. అయితే ప్రతీ సాయంత్రం డ్రిల్లు తరగతులు, లేదా స్కౌటు తరగతులుండటం చేత నాకు క్రికెట్ ఆడేందు కవకాశము లేకుండా వుంది. నాలుగున్నర తదుపరి నన్ను విడిచిపుచ్చేలా తమరు నాకు సర్టిఫికేటు యిచ్చారా ఎం. సి. సి. గెల్చేందుకు తోడ్పడిన వారౌతారు ! ” అని స్వామి తాను [illegible] తగిన విఫలపర్చి చెప్పేసాఁడు.

“మంచిది అల్లాగే యిస్తాను. అయితే - నీ వొంట్లోవున్న బాధేమిటో చెప్పు ! ”

“నిన్నరాత్రల్లా 'సంధి జ్వరం'తో బాధపడ్డాను!” స్వామన్నాఁడు !

“ఏమిటి చెప్తున్నావ్ ” డాక్టరు విస్తుఁబోతూ ప్రశ్నించాఁడు !

మరల స్వామి చెప్పిందే చెప్పాడు !

“చూడబ్బాయి, నువ్వు 'సన్నిపాత జ్వరం' గురించి చెబుతున్నావ్! అసలు — 'సన్నిపాత జ్వర' మంటే యేమిటో నీకుఁదెలుసా ' అని అడిగారు !

“నేనాజ్వరంతో బాధపడ్డాను డాక్టర్. సరిగా చెప్పలేకుండావున్నాను. 'సన్నిపాత జ్వరం' అంటే 'కడుపు నొప్పి' వంటిదిగదూ ? ” అమాయకంగా ప్రశ్నించాడు !




యన్ వి. యమ్. ప్రొడక్షన్స్‌వారి 'లాల్ కన్వార్' హిందీ చిత్రంలో సురయా, నసీర్ ఖాన్‌లు



పార్క్‌టౌన్ మలయాళీ సహకరణ సంఘం భవన నిర్మాణ నిధి సేకరణ సందర్భమున ఏర్పాటు చేసిన నృత్య ప్రదర్శనములలో పాల్గొనిన శ్రీమతులు లలిత, పద్మిని.

దగ్గు విపరీతంగా వచ్చే వరకు డాక్టరు కడుపు చెక్కలయ్యేటట్లు నవ్వాసాగాడు ... తరువాత - స్వామి కండ్లను, నాలుకను, వూపిరితిత్తులను డాక్టరు పరీక్షించి ఆరోగ్యంలో లోపంలేదన్నారు.

"సరే నీకు దొంగ సర్టిఫికేటిచ్చినట్లయితే - నన్ను ప్రోసిక్యూటు చేస్తారు తెలుసా ?

"ఎవరు చూడవచ్చారు డాక్టరుగారూ ? మా ఎం. సి. సి. అపజయము పొందాలని మీకభిలాషగా వుందా ?" స్వామి ప్రశ్నించాడు!

"మీకు జయంరావాలని కోరుతున్నాను ! ... విచారించకు. మీ హెడ్మాష్టరుతో నీ విషయమై మాట్లాడి, సాయంత్రం నాలుగున్నర తరువాత నిన్ను విడిచి పుచ్చేయమని చెబుతాలే ! " అన్నారు.

"ఆమాత్రం చాలు; నేనంటే మీకెంతో అభిమానం డాక్టర్ ! "

ఆ సాయంత్రం - తన డాక్టరు హెడ్మాష్టరుతో మాట్లాడి వుంటారని ఆపోహపడి, స్వామి స్కౌటు క్లాసుకు వెళ్ళకుండా, నేరుగా ప్లేగ్రౌండుకు పోయాడు !

## ౨౧

శుక్రవారంనాడు స్వామినాథన్ జాగ్రఫీతరగతికి హెడ్మాష్టరు చేతో బెత్తంపట్టుకుని, క్లాసులోకి వచ్చాడు. జాగ్రఫీ టీచరైన రామారావు కుర్చీలో నుంచి లేచి నిలబడ్డాడు !

హెడ్మాష్టరు స్వామినుద్దేశించి. — "నిలబడు!"

"ఇలా, రా!" అని ఆజ్ఞాపించారు. దగ్గ రకు వెళ్ళాఁడు.

"నీ సిగ్గులేని వెధవ ముఖాన్ని క్లాసుకోమారు చూపించు!" అంటూ, స్వామి ముఖాన్ని క్లాసు వయిపు తిప్పారు!

"ఈ పెద్దమన్షి, నిత్యం డ్రిల్లుతరగతులకు, స్కౌటు తరగతులకు హాజరుకాకుండా యెగ నామంబెడుతున్నాడు. గత సోమవారంనుండి డ్రిల్లు తరగతులకు రాలేదని నాకు రిపోర్టు చేరింది..." అంటూ, యింకేమేమో చెప్పసాగారు. జాగ్రఫీ మాష్టరు పెదవిలపైనేకాకుండా, స్వామి పెదవు లపైకూడా చిర్నగవు అంకురించింది.

"ఏమయ్యా, నువ్వేమయినా సంజాయిషీ చెప్ప దల్చుకున్నావా?" హెడ్మాష్టరు స్వామిని ప్రశ్నిం చారు.

"మాడాక్టరు...మీతో...నాగురించి మాట్లాడ లేదండీ!" అని కష్టంమీఁద గొంతు విప్పి చెప్పాఁడు!

"ఏడాక్టర్, దేనిగురించి మాట్లాడ్డం?" అని తీక్షణంగ ప్రశ్నించారు.

"అతనన్నాఁడు: మీతో..." అని సందిగ్ధంగా చెప్పసాగాఁడు!"

"ఇదిగో, నువ్వు సంధిగ్ధంగా మాట్లాడేవంటే, వీపు పెక్కేస్తాను; జాగ్రత్త;"

"డాక్టర్ కేశవన్‌గారన్నారు..."

"దేనిగురించి కేశవన్‌గారన్నారు?" అని హెడ్మాష్టరు కట్టించిన గొంతుతో ప్రశ్నించారు!

"నాగురించి మీతో అతను మాట్లాడి డ్రిల్లు తరగ తులకు వెళ్ళకుండేట్లు యేర్పాటు జేస్తామన్నారు. డ్రిల్లు తరగతులకు కొన్ని రోజులవరకు వెళ్లినట్లయితే చచ్చి పూరుకుంటానని, అతనే అన్నారు!"

"అయితే-నీకున్న రోగంయేమిటయ్యా? ఆఁ?"

"సన్నిపాతజ్వరంతో బాధపడుతున్నానని అతనే చెప్పారు..."

"ఇంకా నీనోటినుండి యెటువంటి మాటలు వస్తాయో వినకుతూహలంగా వుం" దంటూ, కను బొమలు యెగురవేయసాగారు.

"అయ్యా, అతను మీతో మాట్లాడేరనుకున్నాను, అతనన్నారు..." అని స్వామన్నాఁడు. తన డాక్టరు తనకీవిధంగా ద్రోహం చేస్తారనుకోలేదు. ఇంతలో- హెడ్మాష్టరు బెత్తం మీఁదకెత్తి.—

"చెయ్యి మీదకెత్తు, ఒక్కొక్క చెయ్యిమీఁద అరడజను దెబ్బలు కొడతాను: ఎన్నాళ్లు డ్రిల్లుతర గతులకు రాలేదో, రోజుకి అరడజను దెబ్బలు!... పోలీసు సూపరిన్‌టెండెంట్‌గాని, వాడికొడుకుగాని, వాడబ్బవచ్చినా నేను ఖాతరు చేసేదిలేదు! తెలుసా, చెయ్యెత్తుమీదకు!"

అని వొక్కమారు వురిమారు. పాము మెలికలు మల్లే వొంపులుఁదిరిగిన బెత్తంను చూడఁగానే, స్వామికి వొంటిమీఁద ఆశలేదనేఁ జెప్పాలి! ఆ దెబ్బలు తను యనుభవించక ముందే యిక్కడనుండి దాటేయటం మంచిదని అభిప్రాయపడిన స్వామి వెంటనే తన డస్కు దగ్గరకు పరుగెత్తి, పుస్తకాలను తీసుఁగొని, క్లాసులోంచి పరిగెత్తి పారిపోయాఁడు!

రోడ్డుమీఁదున్న ఒక చెట్టుక్రిందఁ గూర్చుని చెదిరి పోయిన తన భావములను స్వామి - కూఁడఁదీయ సాగాఁడు! ఆ హెడ్మాష్టరా స్కూల్లో వున్నంత కాలం తానా స్కూలుకు వెళ్ళేందుకు నిశ్చయించు కోలేదు. తన తండ్రికీ విషయం తెల్సిందంటే తన పనియేమౌతుందో ఆ భగవంతునికే దెలియాలి.

(సశేషం)



# కన్నీరు

శ్రీమతి చిల్కపాటి సీతాంబ

అక్కటాదివి కేగితే యభినవాంధ్ర
భోజసత్కవిజన కల్పభూజపూజ్య
మానినీలోకవిద్యా విధానచతుర
గురుతరోదార శ్రీ కోటకుల శశాంక.

చదువులేటికి బోటికి సాము లేల
యింటబడియుంట విధియని కంటుబూను
స్వార్థపరులను నేర్పున సంస్కరించి
దారిజూపితి నారికి ధన్యచరిత.

సతతము విద్యాసక్తిని
వితరణగుణశీల పెక్కు విద్యాలయముల్
క్షితినిల్పియశము గంటివి
అతులితగుణనీకు సాటియవనిం గలరే.

కలిగియును కల్మిగలదని గర్వపడవు
యిచ్చియును యీవిమదినెంచి నొచ్చుకొనవు
పరుషభాషల నేవేళ పలుకబోవు
సజ్జన వరేణ్య శ్రీ నృకేసరి వధాన్య.

అన్నంబిడిరని సతులను
క్రన్నన పూజించి పైడికంకణములచే
మిన్నగ మన్నించితిగద
అన్నా నినుబోలు పుణ్యుడున్నే జగతిన్.

నీ మేలు మరువరానిది
మా మహిళాలోకమునకు మహితాత్మకయిం
కేమని విచారమందిన
నేమున్నది స్వర్గవాసి నెటుగందుమికన్.

అతులశాంతమూర్తి వక్కటాదివి కేగి
యందుస్థిరనివాస మందినావు
గడువరానిలోటుగల్గె మాస్త్రీజాతి
కేమనంచువగతుమో మహాత్మ.

బాయని శాంత మె సొమ్ముగు
ధీయుతుడవు యీశ్వరాజ్ఞ దివి కేగుటయున్
నీ యాత్మ శాంతికొరకై
యోయనఘా దేవదేవునొగి ప్రార్థింతున్.





శ్రీ వై. వి. శర్మ

నాక బానిసగా జమకట్టాడు. ఆతని విజ్ఞానం, భాషా పరిజ్ఞానం, తను బానిసను కుంటూన్న భార్యను తిట్టడానికే ఉపయోగిస్తూంటాయి. కృష్ణరావు అలా తయారవటానికి సమాజమే కారణమని అతడప్పుడు చేస్తున్న సంభాషణలవల్ల వ్యక్తమవుతూంటుంది.

ఏదో ఎలాగో మోయలేని భారంతో యీడుస్తూంది యీ సంసారాన్ని లలిత. తనకున్న ఇద్దరి పిల్లల్ని చూసి సంతోషిస్తూంటుంది. వాళ్లు మాట్లాడే చిలిపి కబుర్లువింటూ కాలక్షేపం చేసుకుంటుంది. నలభై ఏళ్లు పైబడ్డాయి విసుగూ, విరామం లేకుండా పనిచేస్తూంటుంది. తను ఎంత చెప్పినా వినని మొగుడు - కానీ సంపాదన లేదు. తిని తిరుగుతూ సోమరిపోతయ్యాడు. లలిత సహనాన్ని, మంచితనాన్ని చులకనగా తీసుకున్నాడు. ఆమె

మధ్యాహ్నం భోజనాలయ్యాయి. ఆదివారం కావటంవల్ల ఆమె ఖాళీగాఉంది. తోచక ఏదో వారపత్రిక తిరగవేస్తోంది. కృష్ణరావు భార్యతో "సమాజం సరైన త్రోవలో లేదు. సాంఘికాభ్యున్నతి కోరేవాడెవడసలు ? ... సంస్కర్త అనే పేరుతో ఓ పెద్ద మనిషి చేసేపనులన్నీ మంచివైనా, చెడువైనా యీ సంఘంలో జమకట్టబడటం లేదా ? సమాజంలోని సభ్యులంతా లేనికళ్లు ఎరువు తెచ్చుకుని చూస్తూంటారు కావును..." అని యింకా

ఏదో అనబోతూ మధ్యలోఆగి, "అన్నట్టు మరిచిపోయా, ఈ విషయం తెలిసిందా నీకు? ... వాళ్ల స్వారాజ్యం, శేఖర్ ఎక్కడకో లేచిపోయారుట!" అని ముగించి ఏదో పనున్నవాడిలా బయటకు వెళ్లిపోయాడు. ఆ ఉదంతం లలిత నెంతో బాధపెట్టింది. నిద్రపోదామనుకున్నా లాభం లేకపోయింది. తనుగడిపిన మధుర జీవితం కళ్లకట్టజొచ్చింది. తన యిప్పటి జీవితానికీ, అప్పటి జీవితానికీ యెన్నో అంతస్థుల తేడాలున్నాయి.

ఇరవై రెండేళ్ల క్రితం లలితకు పద్దెనిమిదేళ్లవయస్సు. అప్పుడే క్రొత్తగా కాపురానికి వచ్చింది. భర్త శ్రీరామమూర్తి. కొద్దో గొప్పో ఉన్నవాళ్లల్లోనే లెక్క. అమాయకుడు; అనారోగ్యవంతుడు. ఆమె యౌవ్వనానికి తొలిప్రాంగణంలోఉంది - తనయౌవ్వనానికి సార్థక్యం యేర్పడుతుందా అని ఆమె భయపడుతూండేది. నూతన యౌవన సౌధంలో విహరించాలని ఆమె కోర్కె. ఆమెకేకాదు యే స్త్రీ అయినా అంతే. ఆ వయస్సే ఒక శోభ. చక్కగా అలంకరించుకునేది. రకరకాల దుస్తులు వేసుకునేది; ఆమె పొడుగాటి వాలుజడే, ఆమె అందానికొక పెద్ద అలంకారం. తన భర్తను సంతోషపెట్టడంకోసం యెంతైనా చేస్తుంది; చేసేది. కాని యీ అలంకారాలు, ఆభరణాలు దేనికోసం? తనను కుంటూన్న స్వర్గసౌఖ్యం ఏప్పుడు లభిస్తుంది ఆదరంగా, ఉదారంగా మాట్లాడుతాడు కాని సామాన్యంగా యౌవ్వనంలోఉన్న స్త్రీవిషయవాంఛ తెలియని పురుష డుంటాడా? — అదే ఆమె అనుమానం ఆ అనుమానంతోనే కృశించిపోతూండేది ఆ అనుమానమే ఆమెలో అసహానాన్ని పెంపొందింపచేసింది.

"నాహృదయవీణపై అనురాగతంత్రి లాలాపించానే..." అన్నభావ గేయాన్ని పాడుతోంది ఒక పురుషస్వరం. స్పష్టంగ వినిపిస్తూంది; ఎంత చక్కనిభావం? ... గొంతులో ఏదో తెలియని మాధుర ముంది. చివరవరకూ వింది ఆ గేయాని లలిత. ఇంటిప్రక్కనున్న కృష్ణరా పాడుతున్నాడని ఆమెకు తెలుసు. గొంతులో గొంతుకలిపి యుగళ గీతంపా ఎంత చక్కగా ఉంటుంది! — ఇదీ ఆమె ఆలోచన. కృష్ణరావు సంస్కారవంతు చదువుకున్నవాడే; బి. ఎ. ప్యాసయ్యాడ పైస్థాయినందుకున్న మధ్యమ తరగ (Upper Middle Class) చెందిన కుటుం వారిది. చక్కని సంస్కృతి అలవర కున్నవాళ్లు వారింట్లో వారంతా. అధు తన సంప్రదాయాలు; - కాని తన భర్త అత్తగారూ ... పూర్వాచార సంపన్నుల సంస్కారం అంటని మూర్ఖులు; "సంస్కా

సంపన్నులతో సహచర్యం చేస్తే మంచిది''- నిర్ధారించుకుంది లలిత.

అనుకున్నంతా జరిగింది. కృష్ణారావు లలిత మధ్య ప్రేమకలాపాలు బహిరంగ స్థాయివరకూ వచ్చేసాయి. కాని వాళ్లు చేస్తున్నపనిని



చూసి సంఘం సహించదు. సంఘానికి కొన్ని కట్టుబాట్లున్నాయి; కొన్ని ఆచారాలున్నాయి. అనాదినుండీ వస్తూన్న ఆచారాలని అదిగమించాలంటే ఎంతో కష్టమైనపని. ఒక రోజున కృష్ణారావు అననే అనేశాడు. ''లలితా! యిలా ఎన్నాళ్ళని దోబూచిలాడ్తాం? ఎప్పటికయినా ఈ విషయం బహిరంగం కావల్సిందే. నేనింకా అవివాహితుడనే. అందునిక నువ్వునాతో బయలుదేరిరా. ఎక్కడైకైనా వెళ్లిపోదాం. ఈ సంఘాన్ని ఎదిరించగల ధైర్యం, ధనం నా దగ్గిర ఉన్నాయి. నువ్వేం భయపడకు. ఈ సంఘం డబ్బున్నవాడే వైచ్ఛపుపనిచేసినా యేమీ అనలేదు. కాని అదే యేసామాన్యుడో చేస్తే వెలివెయ్యడానికి సాహసిస్తుంది.'' అతని ఉపన్యాసంతో అంతా సావధానంగావింది; భయపడింది. తన జీవితం ఏవిధంగా సాగుతుందో అని సందేహించింది తను; రెండు సిద్ధాంతాలమధ్య

ఆమె పోరాడాల్సివచ్చింది ; ఒకటి:— లక్షలిచ్చినా కొనలేని వంశప్రతిష్ఠ ; గౌరవం ; రెండు—వాంఛ తీరని యౌవ్వనం. ఎలాగవుతేయేం తెగించింది ; ఎందుచేత చేసింది తనలా ? ఎంత ధైర్యం చేసింది ? అప్పటి తనకున్న కామోద్రేకం, తన యౌవ్వనంలోని మిసమిసలు — అవే, అవేగా తనని ఉద్రేకపరచాయి అతనితో లేచిపోయేందుకు .. అబ్బ ! ఆ విషయాలన్నీ తలుచుకుంటూంటే ఎంతో బాధ తనకి ; తలచుకునేందుకే సావకాశంలేదు. అలా మారిపోయింది తన జీవితం.

, జీవితం ఒక చదరంగం ఆటవంటిది. ప్రధానపాత్రమైన రాజుని కట్టేస్తే ఆట అంతా కట్టినట్లే ; యెదురెత్తు వేసేందుకు గూడా వీలుండదు. అందాలకు, ఆనందాలకు, ఆలయం ఆ మెరీనాబీచ్. వచ్చిన క్రొత్తలో కృష్ణరావు తనూ టాక్సీలో జల్సాగా తిరిగిన రోజులలోని మధురత చచ్చినా మరపురాదు. కొత్త కొత్త చీరలు, రవికలు తను ఏంకోరితే అది లభించేది. "నువ్వు ఫలానారంగు చీర కట్టు, - ఊర్వశిలా మెరసిపోతావ్" అని పొగిడేవాడు ; ఇద్దరూ ఆనందడోలికల్లో ఊగులాడారు. రాత్రి తొమ్మిది, పది ... ఒక్కొక్కప్పుడు పన్నెండుగంటలవరకూ ఆ నిండు వెన్నెట్లో అలానే కూర్చుండి పోయేవారు ... కాని యిప్పుడో ! ... ఎంత తేడా—వయస్సులో, మానవుల మనస్తత్వాలలో, కాలంల్లో ... ముఖ్యంగా కృష్ణారావులో.

అలా ఒక దశాబ్దం గడిచింది. పది సంవత్సరాలు పదినిముసాల్లా గడిచిపోయాయి. ఒక్క విషయం. తనవద్ద ధనం, ఆ నిండు యౌవ్వనం ఉన్నన్నాళ్లూ ఎప్పుడైనా గంటలు లెక్కపెట్టిందా ? ఎవరిమాటైనా సలహా ఐనా వినిపించుకుందా ? తన యౌవ్వన సామ్రాజ్యానికి తాను చక్రవర్తిని. కృష్ణరావు దానికధిపతి. అప్పుడప్పుడు తన్ను నూర్జహానులా పోల్చుకునేది. ఒక రోజున కృష్ణరావు అన్నాడు. "లలితా, నా దగ్గరున్న ధనం, నీదగ్గరున్న యౌవ్వనం రెండూ అయిపోయాయి. ఇప్పుడు మనం వీధిలోని ఆ బిచ్చగాళ్లతో సమానం." "అయితే ఏదైనా ఉద్యోగం చెయ్యండి" అని బ్రతిమాలింది. "నేనింతవరకూ కష్టాని కలవాటుపడలేదు ; పడదలచుకోలేదు. నా జీవితాన్ని గురించి నాకు బెంగ లేనేలేదు. నేను చేసినదంతా ఒక్క దోషమే .. ఆ దోషమంతా ఆ యిద్దరు పిల్లలే" అని అర్థంలేని మాటలు మాట్లాడాడు.

తను హాస్పిటలులో నర్సుగాజేరి పది సంవత్సరాలయింది. ఆయనకు సిగరెట్ల దగ్గిరనుంచీ తనే పట్టుకొచ్చి యివ్వాలి ;

చిరాకువస్తే తిడతాడు; కొడతాడు; జీవిత నాటక రంగంలో తానిప్పుడొక దాసీ మాత్రమే. ఓపిక లేకపోయినా ఓపిక తెచ్చుకోవాలి. తప్పదు. తన జీవితాంతం వరకూ అనుభవించక తప్పదు. జీవం నశించిన యంత్రంల్లా తయారయింది. దీన్నే కావును "ఈతిబాధలు" అని పేరు పెట్టారు ఋషులు. ఇదొక అగ్ని గుండం. ఈ గుండంలో తనలా శలభాల వలె ఎంతమంది హతమవుతున్నారో.!

"అమ్మా అన్నం పెట్టవే" అన్నాడు చిన్న కుర్రాడు నవ్వుతూ; అప్పుడు తను మళ్ళీ ఆ ఊహా ప్రపంచంలోనుంచి యీ నిజ ప్రపంచంలోకి వస్తూంటుంది. కళ్ళ వెంబడ కారే నీళ్ళను పసిపిల్లలు చూడకుండా పమిటతో ప్రక్కకు ఒత్తుకునేది. ఇప్పటికీ ఆయన పొద్దూనే ఉంటారు. "నా హృదయవీణపై అనురాగతంత్రు లాలాపించానే" అన్న భావగేయాన్ని తను లేని చిరునవ్వు తెచ్చుకోడానికి ప్రయత్నిస్తుంది.




పరమాత్మ విలాసం

(516-వ పేజి తరువాయి)

గారూ" అని మందహాసముతో భార్యవంకచూచెను. తల్లియు నవ్వుచు "వినరా, నాయనా నాకు తోచినది చెప్పెదను. మీ నాన్నగారెప్పుడు పరిహాసముచేయుచునే యుందురు. వింటే వినండి, నవ్వితే నవ్వండి గ్రంథములలో చదువగా తెలిసిన విషయములను నాకు తోచిన భావములను సమన్వయించి చెప్పెదను" అని ప్రారంభించెను.

## ద్వితీయ తరంగము

### భారత కృష్ణుడు, భాగవత కృష్ణుడు

'శ్రీ కృష్ణునిగూర్చి భారత, భాగవత, హరివంశ విష్ణుపురాణములందు చెప్పబడియున్నది. భారతమునందు కృష్ణుని గొప్ప రాజ్యతంత్రజ్ఞునిగను, మహత్తర తత్త్వవేత్తగను తెలిసికొనుచున్నాము. భాగవతమున అట్లుగాక నవనీత చోరునిగను, గోపికాజారునిగను, కంసాదిదైత్య సంహారునిగను గాంచుచున్నాము. వీరు వేరు వేరు వ్యక్తులాయను సందేహము సామాన్యజన సమూహులకులేదుకాని కొందరు పరిశోధకులు, విమర్శకులు పరామర్శించి యిట్టి సందేహమును రేకెత్తించిరి. కొందరు ముగ్గురు కృష్ణులుగూడ గలరాయను సందియముగల్గించిరి. భగవద్గీతాయోగ శాస్త్ర బోధకుడొకడు, పాండవమిత్రుడై, యాదవనాయకుడై రాజ్యతంత్ర ప్రవీణుడైన యతడొకడు, గోగోపికా ప్రియుడై, గోపాలుడై గొల్లపిల్లలతో నల్లరిచేసిన యతడొకడు - ఇట్లు మువ్వురు కృష్ణులుండిరని కొందరూహించిరి. ఈ విమర్శకులలో ముఖ్యులు రామకృష్ణ గోపాల భండార్కరు, ఆచార్యజాకోబి, డాక్టరు వింటర్నిట్సుగార్లు - వీరిలో మూడవవారు హిందూవాఙ్మయచరిత్రవ్రాయుచు పాండవసహాయుడై భగవద్గీతా సందేశ మొసంగిన కృష్ణుడును, గోపికాజారుడైన కృష్ణుడును, విష్ణుమూర్తి యవతారమని చెప్పిన కృష్ణుడును యేకవ్యక్తియేయని నమ్ముట చాలా కష్టమని స్పష్టముగా వ్రాసిరి. ఇట్లు చెప్పుట సమంజసముకాదనిరి. అందువలన వేరువేరు కృష్ణులుకలరేమోయను సందియము నిజముగా జనింపవచ్చును. పైవిమర్శకులు తమవాదపోషణకై కొన్ని కొన్ని హేతువులొసంగిరి. కాని పురాణేతిహాసములలో గల విరుద్ధగుణ ప్రదర్శన మాత్రముననే పెక్కండ్రు కృష్ణులున్నట్లు భావింపజాలము. ఆయాగ్రంథములలో దెల్పబడిన, గుణపక్షేదము లొకేవ్యక్తియందుండగూడదా ? విరుద్ధవిభూతులొకనియందే వ్యక్తమగుటగూడ శ్రీ కృష్ణ దైవత్యము సూచించుచున్నది. కాని కేవల చారిత్ర విమర్శనా బుద్ధితో పరిశోధనలుచేయువారొకవేళ తమ యూహాపోహల తీవ్రతలో తప్పు సిద్ధాంతమునకు రావచ్చును. ఈ సిద్ధాంతముల విమర్శింపబూనుటకంటె శ్రీ కృష్ణుని జీవితమునందొక భాగము భారతమునందును, మరియొక భాగము భాగవతమునందును హరివంశమునందును తెలుపడినట్లు మాత్రము చెప్పవచ్చును. పురాణములలో కృష్ణుని కుటుంబ జీవితము బాల్యమును వర్ణింపబడినవి. భారతములో నాతని బహిరంగ జీవితము చెప్పబడినది. ఆతని రహస్యజీవిత ప్రసక్తి భారతమున కక్కరలేదు. పాండవపక్షము వహించి వారి రాచకార్యముల నెట్లు సమర్థించెనో, రాయబారిగా కౌరవ సభలో నెట్లు వర్తించెనో యుద్ధరంగమున సారథియై యెట్లు చాకచక్యముచూపెనోయను విషయములు మాత్రమే భారత చరిత్రకారున కవసరము - అంతేగాని చిన్నప్పుడెట్లు వెన్నముద్దలు మ్రింగెనో, పాలకడవలెట్లు పగులగొట్టెనో గోగోపికలతోనెట్లు మైత్రినెరపెనో, అంతఃపుర కాంతలతో ప్రణయకలహములెట్లు సాగించెనో యను విషయములు భారతములో దెల్పినచో నాకవి పరిహాసపాత్రుడగును.

ఆతని వ్యక్తిగత జీవితము వర్ణించుట భాగవత హరివంశ విష్ణుపురాణములో నవసరము. గావున కృష్ణునిపుట్టుక, బాల్యవర్తనము, మిత్రామిత్ర సంబంధము, గోకులమువీడి మధురాపురమునకేల నరిగెనో, యేసందర్భమున ద్వారకజేరెనో వివాహాది కార్యములెట్లు జరిగెనో, భార్యలెవ్వరెవ్వరో పుత్రపౌత్రాదిక బంధువర్గమెవరో మున్నగు విషయాలా పురాణములలో చెప్పబడినవి.

అంతేగాక భారతమున కృష్ణునకు ప్రవేశము గల్గు నాటికే యతడు పెద్దవాడై యాదవరాజైనాడు. ద్రౌపదీ స్వయంవర సమయమున శ్రీకృష్ణుడు ప్రధమతః భారతమున ప్రవేశపెట్టబడెను. అటు పిమ్మటనే పాండవులు కృష్ణుని సాయముతో జరాసంధాదులజంపి దిగ్విజయము పూర్తిజేసికొని రాజసూయాధ్వర మొనర్చికొనిరి. రాజసూయ మహోత్సవమునాటికే కృష్ణుని పేరు ప్రతిష్ఠలు వన్నెకెక్కెను. అందుచేతనే ప్రధమార్ఘ్యము గ్రహించు గౌరవము దక్కెను. శిశుపాలుని యధిక్షేపమువలన కృష్ణుని గొప్పదనము నంగీకరింపనివారు కొందరున్నట్లు తెలియుచున్నది. భీష్మాది వీరులును, పాండవులును కృష్ణుని దైవసమానునిగా నమ్మిరిగాని తక్కిన కౌరవులును వారి యనుయాయులు గౌరవించలేదు. భారతమందెచ్చట చూచినను కృష్ణుడున్యాయపక్ష మవలంబించి పాండవులను అనగా న్యాయపక్షమునకు విజయము చేకూర్చుటకు సహాయపడినట్లు కనుపడుచున్నది. అందుచే నతడు పాండవ పక్షపాతి యనియును మాయావియనియును నిందకు సయితములోనయ్యెను. ఆతని సామాన్యరాజ్యతంత్రజ్ఞునిగా పరిగణించినను భారతేతిహాసమునుబట్టి న్యాయవర్తులు, ధర్మపరులునైన పాండవులకు రాజ్యపునః ప్రతిష్ఠగావించినట్లు స్పష్టపడుచున్నదేగాని స్వార్థముకొఱకై చేసినట్లు గన్పించదు. తత్కారణమున నతడు గాంధారీ ఘోరశాపమునకు గురియయ్యెను. అంతేగాని తనకు రాజ్యలాభముగాని, అర్థలాభముగాని పొందలేదు. న్యాయధర్మస్థాపనా విజయము సాధించిన హృదయ సంతుష్టిని మాత్రము పొందియుండవచ్చును.

ఇక కృష్ణుని కుటుంబజీవిత సంబంధమగు చరిత్రకు వత్తము - ఉగ్రసేనుడు రాజైయుండగా కంసుడు విప్లవకారియై, తండ్రిని చెఱలో బంధించి తాను సింహాసన మెక్కుటయు ఆ సందర్భమందే దేవకీ వసుదేవుల చెఱనుంచుటయు, కృష్ణుడు చెఱలోనే జన్మించుటయు, మాయోపాయమున గోకులమునకు జేర్పబడుటయు అతడు నొక విప్లవకారుడై కంసునిజంపి ఉగ్రసేనుని తిరిగి రాజుగజేయుటయు మున్నగు విషయములు పురాణములలో చెప్పబడియున్నవి. అతడనేకమంది భార్యలనైకొనుటయు, ఆయాసందర్భములలో ప్రతిపక్షులగు రాజుల ననేకుల సంహరించుటయు జరిగెను. కృష్ణుని వంశాభివృద్ధి పుత్రపౌత్రసంపత్తి, ధైర్యశౌర్యములు, కీర్తి, యాదవ ప్రజాపాలనా నైపుణ్యము, మహిమలు అన్నియు వర్ణింపబడినవి. ఈ పౌరాణికగాధ బాణాసురవధ, ఉషా కన్యకా పరిగ్రహణము, యాదవ విజయముతో పరిసమాప్తమైనది. అయితే కృష్ణుని జీవితమున తుదిఘట్టము మిక్కిలి విషాదపూరితమైనది. యాదవులు తమలోతాము కొట్లాడి నాశనమగుట సంభవించినది. కృష్ణుని నిర్యాణముకూడ శోచనీయగాధ. అవతారమూర్తియగు నతడా యాదవ ప్రజాపరస్పర వైషమ్యముల నివారణ జేయజాలడయ్యెనాయని కొందరకు తోచవచ్చు. బుద్ధిపూర్వకముగానే యాదవనాశనము కృష్ణుడు సంఘటించెనని యందురుగాని మానవదృష్ట్యా విచారించినచో నిది సరిగాదనుట స్పష్టము. నిజమైన కారణము పురాణములలోగాని భారతమున మౌసల పర్వమునగాని చెప్పబడలేదు - కాని శాంతిపర్వములో నొకమూల యెనిమిదవ అధ్యాయమున శ్రీకృష్ణ నారద సంభాషణలో యాదవుల విషయమై తన హృదయవేదన నారదునితో చెప్పియున్నాడు. యాదవ వీరులలో నాయకత్వమునకై పోటీవచ్చి పరస్పర ద్వేషములు గల్గెననియును, కుల నాశనకరమైన పోటీనాపి యైకమత్యము గల్గించుటకు తనకు శక్తి జాలకున్నదనియును అంతేగాక తన కుటుంబమునందే విరోధము లేర్పడినవనియును, దానికై దుఃఖపడుచున్నాననియు చెప్పెను.

శ్లో॥ బలం సంకర్షణే నిత్యం సౌకుమార్యం పునర్గదే.
రూపేణ మత్తః ప్రద్యుమ్నః సోఽసహాయోఽస్మి
నారద' అని కృష్ణుడు చెప్పగా నారదుడిట్లనె.

శ్లో॥ భేదాద్వినాశః సంఘానాం, సంఘముఖ్యోఽసి
కేశవ, యయాత్వాం ప్రాప్యనోత్సీదే
దయం సంఘస్తథాకురు:

అనగా సంఘములో భేదభావమున సంఘము నశించు ఈ సంఘమునధినాధుడవు నీవు - కావున నిట్టి భేదములురాకుండా నీవు ప్రవర్తించవలెను. పేరున కుగ్రసేనుడు రాజైనను కృష్ణుడే సర్వాధికారములు నిర్వహించుటచే నారదుడట్లన్నాడు. యాదవులమధ్యగల్గిన యధికారాపేక్ష, స్పర్ధలు వృద్ధాప్యమున కృష్ణుడాపలేక పోవుటచేతను, గాంధారి శాపము చేతను యాదవక్షయమయ్యెనని చెప్పవచ్చును. ఆ విషయమెట్లున్నను శ్రీ కృష్ణుడవతార పురుషుడని యెంచి పూజించుచున్నాము. పురాణములతని భగవంతుడని చెప్పినవి. భారతములోని గీతా శాస్త్రమును భగవద్గీతలని చెప్పుచున్నాము. గీతా కృష్ణుడే పార్థసారథియని తెలియుచున్నది. గనుక కృష్ణుడొకడేయని తోచుచున్నది. ఒక కృష్ణుడే చిన్నతనమున గోపాలుడై, నవనీతచోరుడై గోగోపీ వల్లభుడై, కంసాది దుర్జన సంహారుడై పిమ్మట పాండవ రాయబారియై, విజయసారథియయ్యెను. భాగవతమున కృష్ణుడు దేవకీ వసుదేవులకు కుమారుడని చెప్పబడినది. భారతమున రాజసూయాధ్వర సందర్భమున శిశుపాలుడు కృష్ణునధిక్షేపించుచు "ఈతండు వృద్ధని యెరిగి పూజించితే వసుదేవుడుండంగ వసుమతీశ" అనెను. ఉద్యోగపర్వమున ధృతరాష్ట్రుడు సంజయ రాయబారము పిమ్మట, యుద్ధమునకు వచ్చువారు పాండవుల పక్షమున నెవ్వరు కలరని ప్రశ్నింపగా సంజయుడు పెక్కండ్ర పేర్లుచెప్పి తుదకు కృష్ణుని పేరు చెప్పుచు,

కం॥ సకల భువనముల నరచే
తికి శేరంజాలునట్టి ధీమంతుడు, దే
వకి కొడుకుగలడు ధర్మజు
నికి నాతండె త్తిరాక నిలుచునె యధిపా ॥

అని కృష్ణుని దేవకి కొడుకని చెప్పెను.

కృష్ణుని నిర్యాణమును ధర్మజునకు అర్జునుడు దెల్పు సందర్భమున ద్వారకలో చనిపోయిన కృష్ణుడే తమ సారధి, సచివుడు, వియ్యము, గురుడు, దేవరయని వర్ణించినాడు. ఈ మాటలవల్ల కృష్ణులు యిద్దరా, ముగ్గురా అను వాదము లెగిరిపోవుచున్నవి.

అనగా సారధి సచివుడు అనుపదములచే భారత కృష్ణుడని స్పష్టము. గురువు అనుటచే తమ సారధే తన గీతా శాస్త్ర గురువనియును, వియ్యమనుటచేత భాగవత కృష్ణుడనియును తేలుచున్నది. పైగా దేవర అని వర్ణించినాడు గనుక అవతారమూర్తియు, గోపాల మూర్తియు యోగీశ్వరేశ్వరుడును, పార్థసారధియు నొకే కృష్ణుడని నిస్సందేహముగా చెప్పవచ్చును.

ఇంతలో పెద్ద కుమారుడు "అమ్మా, శ్రీ కృష్ణుని కాలమున మనదేశమున రాజులంతగా పరస్పర విరోధములుగల్గియుండిరా" !

అవి వారించుటకు కృష్ణుడేమి జేసెను ?

ఇంతలో తండ్రిలేచి, "మన మీ పురాణ ధోరణిలో పడి భోజనాలు మరచినాము ఇక నాపండి" అనెను. తల్లికూడలేచి రేపు ఆ సంగతి చెప్పెదనులే అని భోజనశాలకేగెను. అందరును ఆమె వెంట నేగిరి.

సశేషము



# సర్ అల్లాడి కాల ధర్మం యావద్భారతానికి తీరని లోటు

శ్రీ సి. సి. పున్నయ్య

అవ్యక్తి బాహ్య ప్రపంచానికి ఆకర్షణీయంగా, ఆడంబరంగా కనుపించకపోయి యుండవచ్చును; కాని బలీయమైన ఆత్మబలంతోటి, దీక్షాసక్తులతోటి అల్పస్థాయి నుండి తమ జీవిత రూపురేఖలను మహోన్నత స్థాయికి దిద్దుకొన కలిగినవారిలో సర్ అల్లాడి యొకరు. వారి జీవితరహస్యం ఇంద్రజాల మహేంద్ర జాలాలలాంటివేమి కాదు. 'కష్టేఫలే' అనేది మాత్రం.

నివాసం మద్రాసు నగరమయినా ప్రముఖ న్యాయవాదిగా యావద్భారత దేశంలో పేరుగాంచారు. వారి రాజకీయ పరిజ్ఞానం భారత రాజ్యాంగ రచనా కాలంలో స్పష్టమయింది. వీరి నిర్యాణము ఆసేతుహిమాచల పర్యంతమును విచార సాగరంలో ముంచేసింది.

శ్రీ కృష్ణస్వామి ప్రతిభావంతుడైన న్యాయవాదిగా పేరుగడించుకొన్న తెలుగు బిడ్డ. కాని ఆయన జన్మస్థలం నెల్లూరుజిల్లా అయినా, మాతృ భాష తెలుగయినా, వారు చేసినస్నేహం, తన రూపురేఖలు దిద్దుకొనిన వాతావరణం తమిళం కాబట్టి వాళ్లయింట్లో మాట్లాడే భాష సయితం తెలుగు తమిళ మిశ్రమమయింది. పైగా తన వృత్తిలోని సాధక బాధకాలనుబట్టి తాను తెలుగువాడా, అరవవాడా అనే సమస్యకు అవకాశము లేకుండా వ్యవహరించేవారు.

ఆంధ్ర రాష్ట్రనిర్మాణోద్యమ కార్యకలాపాలలో ఆంధ్రమహాసభ ద్వారా ప్రముఖపాత్ర నిర్వహించారు. దాని ఫలితంగా రాష్ట్రావతరణను స్వయముగా రాజధాని నగరానికి వెళ్లి చూడలేక పోయినా చెవులార వినకలుగడం వారి అదృష్టం.

సర్ అల్లాడి కృష్ణస్వామిగారు కడుబీద స్థితిలో తన సోదరుని యొక్కయు, స్నేహితుల యొక్కయు సహాయంతో విద్యాభ్యాసముచేసి 1907 లో న్యాయవాది వృత్తి నవలంభించినప్పుడు ఎవరి సహాయ సహకారాలు లభించకపోగా హేమాహేమీలు సర్. వి. భాష్యం అయ్యంగారు, యస్. శ్రీనివాస అయ్యంగార్లలాంటివారిని ఎదుర్కొనవలసివచ్చింది. కాని పట్టుదలతో 1920 సం. ము నాటికి న్యాయశాస్త్ర పారంగతుడుగా ప్రసిద్ధికెక్కారు. 1928 సం. మునుండి 1945 సం. ము దాక అడ్వకేటు జనరలుగా నియమింపబడ్డారు.

న్యాయవాది వృత్తిలో సర్ అల్లాడి సామాన్య ప్రజానీకానికి అందుబాటులో లేకపోయినా పెద్దపెద్ద జమీందారీ, ఆస్థి వారసత్వం, కంపెనీతగాదాలు, హిందూ చట్ట సంబంధమైన కేసులను వాదించి విశేష పేరు ప్రఖ్యాతులతో బాటు పుష్కలంగా ధనం సంపాదించారు.

ఆయన చిన్ననాటి కష్టాలను జ్ఞాపక ముంచుకొని యూనివర్సిటీలకు, విద్యా సంస్థలకు ఎన్నెన్నో దానధర్మములు చేశారు.

సర్ అల్లాడి కృష్ణస్వామిగారు తెరచిన నూతన భవనాలలో 1937 సం.లో 'గృహలక్ష్మి' భవన మొకటి. కేసరివిద్యా సంస్థకు జీవితాంతము వరకు ప్రెసిడెంటుగా నుండి తమ అమూల్యమైన సలహాలు సూచనలతో విద్యాలయాల నిర్వహణ కెంతో తోడ్పడుచుండేవారు.

నిర్విరామంగా కృషి సల్పుచుండిన భారతమాత అనుంగు పుత్రుడు సర్. అల్లాడి ఆత్మకు పరలోకంలో పరిపూర్ణ శాంతి సమకూరుగాక ! విచారసాగరంలో మునిగియున్న కుటుంబమునకు దేశం నలుమూలలనుండి వచ్చు సానుభూతిపరంపరలు దుఃఖోపశమనానికి తోడ్పడకలుగుగాక!






## జెమినీ వారి 'అవ్వయ్యార్' ను గురించి ప్రశంసా పరంపరలు

చలనచిత్రనిర్మాత, దర్శకుడు, నటుడు అయిన శ్రీ వి. నాగయ్యగారు "...నిజంగా భారత సంస్కృతిని వెల్లడిస్తున్న చిత్రాన్ని విదేశాలకు పంపాలంటే 'అవ్వయ్యార్' చిత్రము ఒకటే తగింది .... వేలకొలది ప్రజలు యీ చిత్రాన్ని చూచి దానిలోని నీతులు వారి హృదయాలలో హత్తుకు పోవాలి ..."

◆ ◆ ◆

ఆంధ్ర ముఖ్యమంత్రి శ్రీ టి. ప్రకాశం గారు 'ప్రతియొక్క ఆంధ్రుడే చూడటం కాక దేశంలోని ప్రతిభాగంలోను 'అవ్వయార్' చిత్రం ప్రదర్శించబడాలి. ఇంత ఉత్తమ చిత్రం కాబట్టి నాతో కర్నూలుకు వెంట తీసికొని పోదలచాను ..... అవ్వయ్యార్ లాంటి పూజ్యులు బోధించిన స్వార్థరహితమయిన సేవను, ప్రతి యొక్క దేశము,

◆ ◆ ◆

ప్రముఖ సినీమా నటి శ్రీమతి జి. వరలక్ష్మి శ్రీ వాసన్ గారితో "... ఏనాడో దేశానికి ముక్తి మార్గం చూపించిన అవ్వయ్యార్ ను యీ చిత్రము ద్వారా యీనాడు మరల బ్రతికించి ఆమె దివ్యసందేశాన్ని దేశదేశాలకు అందచేస్తున్నందుకు మీరు సయితం పూజ్యులు"



జమినీవారి 'అవ్వయ్యార్' (తెలుగు) చిత్రము జమినీ స్టుడియోస్ లో ప్రత్యేకముగా ప్రదర్శించినప్పుడు శ్రీ వి. నాగయ్య ప్రశంశించినప్పటి చిత్రము.

రాజ్యము, ప్రజలు ఆమోదించి అనుసరించాలి.''

♦ ♦ ♦

శ్రీమతి లీలా భాస్కరయ్యగారు ''విదేశీయ నాల్గవ తరగతికి చెందిన సినీమాల ప్రభావంవలన మనసంస్కృతి, నాగరకతలు సాంకర్యము చెందినవేమో నన్నట్లుగా తప్పుడు ప్రచారం జరుగుతున్న యీ రోజులలో అవ్వయ్యార్ చిత్రము సకాలంలో మన ఉత్తమోత్తమమయిన సంస్కృతి వార సత్వాన్ని చాటుతున్నది''

♦ ♦ ♦

'శ్రీ శ్రీ'గారు యం. యల్. సి. ''తమిళ కవయిత్రియే కాక భారత కవయిత్రి కూడ నయిన అవ్వయార్ జీవితచరిత్రను చలనచిత్రంగా నిర్మించినందుకు శ్రీ వాసన్ గారిని అభినందిస్తున్నాను. ఈ చిత్రం యావద్భారత దేశంలో ప్రదర్శించవలసిన ఉత్తమమయినది.''

♦ ♦ ♦

ఆంధ్ర ఆర్థిక మంత్రి శ్రీ తెన్నేటి విశ్వనాథంగారు ''ఇట్టి ఉత్తమ చిత్రాన్ని నిర్మించి తెలుగుభాషా ప్రాంతీయులకు సయితము అర్థమయేలాగ చేసినందుకు శ్రీ వాసన్ గారిని అభినందిస్తున్నాను.

చలనచిత్ర నిర్మాణంలో నూతన మార్గాన్ని అవలంభించి యితర నిర్మాతలకు ఆదర్శనీయుడైనాడు. ఇట్టి ఉత్తమ చిత్రాలు యింకా నిర్మాణమయి ప్రజల హృదయాలలో హత్తుకొని పోగలవని ఆశిస్తున్నాను.''

---

రోహిణీవారి 'ప్రతిజ్ఞ' చిత్ర నిర్మాణము పూర్తి అయింది. ఇందులో శ్రీ కాంతారావు, సావిత్రి ప్రధాన భూమికలు నిర్వహించారు. ఈ నెలలోనే విడుదల కాగలదట.

♦ ♦ ♦

మద్రాసు ఆర్ట్ ప్రొడక్షన్స్‌వారి 'రోహిణి' కూడ విడుదలకు సిద్ధంగా నున్నదట. ఈ చిత్రంలో లంక సత్యం, రంగారావు, మాధురి మున్నగువారు నటించారు.

♦ ♦ ♦

ప్రసాద్ ఆర్ట్ ప్రొడక్షన్స్‌వారి 'పెంపుడుకొడుకు' చిత్రంకూడ విడుదలకానున్నవానిలో నొకటి. ఇందులో కుమారి, పుష్పవల్లి, సావిత్రి, రామమూర్తి మొదలగువారు నటించారు. దర్శకత్వము శ్రీ ప్రసాద్.

♦ ♦ ♦

'పాపాయి' అనే పేరుతో బొంబాయి సాహితీ పిక్చర్స్‌వారు చిత్రనిర్మాణం ప్రారంభించారు. శ్రీ సి. హెచ్. నారాయణరావు, శివరావు, జమున, రాజ్యలక్ష్మి, కనకం మున్నగువారు యిందులో నటించుచున్నారు.

♦ ♦ ♦

శ్రీమతి కన్నాంబ, అమరనాథ్, కృష్ణకుమారి మున్నగు వారితో శ్రీ రాజ రాజేశ్వరివారు తయారు చేస్తున్న 'లక్ష్మి' చిత్ర నిర్మాణం యించుమించుగా పూర్తి అయింది.

♦ ♦ ♦

జయంతీ ప్రొడక్షన్స్‌వారి 'బంగారుభూమి'

చిత్రం మూడువంతులు తయారయింది. ఇందులో అంజలీదేవి ప్రధానపాత్ర వహిస్తున్నది.

♦ ♦

అంజలీదేవి, రేలంగి వేంకటరామయ్య ప్రధాన పాత్రలు నిర్వహిస్తున్న ఈస్టిండియావారి 'పక్కింటి అమ్మాయి' చిత్రం చాల భాగం పూర్తి అయింది. ఈ చిత్రానికి శ్రీ సి. పుల్లయ్య దర్శకుడు.

♦ ♦

అశ్వరాజ్ ప్రొడక్షన్స్ వారి 'అన్నదాత' చిత్ర నిర్మాణము ప్రారంభమయింది. దర్శకుడు వేదాంతం రాఘవయ్య. మల్లాది వేంకట కృష్ణశర్మ, డా॥ గాలి బాలసుందరరావుగారలు కథారచన సాగిస్తున్నారు. ఇందులో అంజలి, నాగేశ్వరరావు, రంగారావులు ప్రముఖ పాత్రలు నిర్వహిస్తున్నారు.

♦ ♦



ఈస్టిండియా వారి "పక్కయింటి అమ్మాయి"లో అంజలిదేవి.

'త్యాగయ్య' తెలుగు చిత్రానికి హిందీ వ్యాఖ్యానం చేర్చి ఉత్తర దేశంలో విడుదల చెయ్యడానికి చిత్తూరు వి. నాగయ్య సర్వసన్నాహాలు చేస్తున్నారు.

♦ ♦ ♦

నరసూ పిక్చర్స్ వారు 'విషబిందు' అనే చిత్రమును తెలుగు, తమిళ భాషలలో స్వంత స్టూడియోలో తయారు చేస్తున్నారు. తెలుగు పాటల రచన దేవులపల్లి కృష్ణశాస్త్రి నిర్వహిస్తారట.

# ఆంధ్ర జానపద గేయ వాఙ్మయ చరిత్ర

## జంగం కథ

శ్రీ టేకుమళ్ల కామేశ్వరరావు

(గతసంచిక తరువాయి)

మొత్తంమీద అతిశయోక్తులు చెప్పితే కవులు, ప్రజలుకూడ సంతోషించేవారు. అదొక చెడ్డ సంప్రదాయమని వేరే చెప్పనక్కరలేదు. రచనకి గొంతెమ్మ ఆలోచనలు (Wishful thinking) ఆధారమయ్యేయి. గాలిమేడలు తయారయేయి. రాజుగారిదగ్గిర లక్షల కొద్దీ, కోట్ల కొద్దీ ఏనుగలుండేవట! బహుశా ఈ దుర్లక్షణాన్ని జానపదకవుల దగ్గిరనుంచి ప్రబంధకవులు తీసుకొన్నారు. అది వారిలో పరిపూర్ణత పొందింది. కథ అసలు జరిగిందా మానిందా అన్న గొడవే లేకపోయింది ప్రబంధకవులకి. సమకాలిక ఇతివృత్తాల అవసరమే లేకపోయింది. ఏ పాతపురాణంలోంచో ఒక కథ తియ్యడం. గోరంతలు కొండతలుచేస్తూ, వన్నె చిన్నెలు చెక్కుతూ ఒక బొమ్మని తయారు చెయ్యడం. సజీవ సాహిత్యంపోయి కృతక సాహిత్యం తయారయింది. ఈ దుర్లక్షణం ప్రబంధాలలో పరిపూర్ణతచెంది తర్వాత మళ్లీ జానపద రచనలలోకి దిగింది. పందొమ్మిదో శతాబ్దం, ఇరవయో శతాబ్దంలో రచింపబడ్డ పదాలు - అనగా - శశిరేఖా పరిణయం, గయోపాఖ్యానం ఇత్యాదులలో కనబడుతూంది. జానపదకవి వెనకటి గ్రంథాల నుంచి పైన చెప్పబడినకథ వంటిది తీసుకొని జానపద చందస్సులో ఒక ప్రబంధం రాసేవారు. ఈ విషయం అర్వాచీన పదాలు అనేవర్గంకింద చర్చించబడుతుంది. కాని జంగం కథల లక్షణమే కొంతవరకు భిన్నం.

### ఒక పెద్ద లోపం

జంగంకథా కల్పనలో ఒకపెద్దలోపముందని చెప్పక తప్పదు. యథార్థతకు, వాస్తవికతకు తగిన ప్రాముఖ్యమియ్యక, వ్యర్థమైన ఊహకు కల్పనకు తావియ్యడం లోపమే! దానితో నిజంగాక అభూతకల్పన జాస్తి అయింది. ఇట్టి రచనవల్ల నిజం మరుగున పడిపోతూంది; లేనిపోని అద్భుతాలన్నీ నమ్మవలసి వస్తూంది. చదువరులకు లోకజ్ఞానాన్నిగాక వ్యర్థజ్ఞానాన్ని కలిగిస్తున్నాయి. ఇదొక పెద్దలోపమని చెప్పక తప్పదు. ఇట్టి పేచీలవల్ల తెలుగులో ఉన్నది ఉన్నట్టు చెప్పడం ఒక అలంకారమయిపోయింది. దానిని ఆలంకారికులు సహజోక్తి అని పేరు పెట్టేరు. ఇది సబబైన పంథా కాదని వేరే చెప్పనక్కరలేదు. లోకంలో పనికివచ్చేది యథార్థజ్ఞానంకాని గొంతెమ్మ కల్పనలు కావు. కల్పనల మధ్య యథార్థత్వం నలిగిపోయింది. కాని జంగం కథలలోఉండే ఇతర సల్లక్షణాలే వాటికి శాశ్వత పదవిని కల్పించేయి.

### దుఃఖాత్మకం ; సుఖాంతం

సాధారణంగా జంగంకథలు దుఃఖాత్మకంగానే ఉన్నాయి. వాటిలో ప్రధాన పాత్రల జీవితం కష్టభూయిష్ఠంగాగాని లేక కథ చాలవరకు బాధలతో నిండిగాని ఉంటుంది. కథ చివర యుద్ధం జరిగిన పెద్ద బొబ్బిలి రాజుకథ దుఃఖాత్మకమనే చెప్పాలి. ఇంచుమించుగా కుమారరాముని కథ, గాంధారికథ, బంగారు తిమ్మరాజుకథ, దేశింగురాజు కథకూడ ఇట్టివే! సాంఘిక కథలైన చిన్నమ్మ, కమ్మవారిపణతి, సన్యాసమ్మ, కామమ్మ కథలు కష్టపరంపరలతోనిండి చివరకి మరణంతో అంతమవుతున్నాయి. రాజకుటుంబంలో దుఃఖాత్మక కథ

నల్లతంగాళ్ కథ, కాంభోజరాజుకథలోను, కొంత వరకు దాని అడుగుజాడలలో నడిచిన బాలనాగమ్మ కథలోను ప్రధాన పాత్రల జీవితాలు కరుణరస పూరితాలు. పైగా బాలనాగమ్మకథలో చివర ఘోర యుద్ధం జరిగింది. కాబట్టి సుమారుగా ఈ కథలన్నీ దుఃఖాత్మకాలే అని చెప్పాలి. కాని ఇక్కడ ఒక విశేషముంది. కథలు దుఃఖాత్మకాలు కాని అంతం సుఖాత్మకం. ప్రధాన పాత్రలు నశించిన తర్వాత కథ కొంత మిగిలిపోతుంది. అది సుఖంగా ముగుస్తుంది. బాలతిమ్మరాజుకథలో ప్రధానవీరుడు, రాజులు ఇంకా ఎందరెందరో యుద్ధంలో నశిస్తారు. కాని చివరకి శేషుపట్టణాన్ని కృష్ణమరాజు, పెనుగొండను అతని తమ్ముడైన రంగరాజు పరిపాలిస్తారు అని కవి చల్లని కబురు చెపుతాడు. ఇట్లే బొబ్బిలి యుద్ధంలో ఎందరెందరో నశిస్తారు. కాని కవి చివరకి వెంకటరాయుడికి బొబ్బిలి పట్టాభిషేకంజరిపి వేడిచి పెడతారు. సాంఘిక కథలలో సైనా సరే సాధారణంగా అంతే! చనిపోయిన నల్లతంగాల్‌ని ఆమెకు కావలసిన వారిని శివుడు బ్రతికిస్తాడు. వాళ్లు స్వేచ్ఛగా కైలాసం చేరుకుంటారు. కమ్మవారిపణతి పసులబాలరాజ కథలోకూడ వీరులు వైకుంఠంలో సుఖిస్తారు. సన్యాసమ్మకథలో ఆమె సహగమనం చేసేక తిరిగి జన్మిస్తుంది. ఆమె పెద్దదయేక పెళ్లి చేసి మరీ కథను ముగిస్తాడు. అట్లే కాంభోజ రాజు కథలో చివరకి మాణిక్యదేవి జైలునుంచి విడుదలవుతుంది. బాలనాగమ్మ జైలునుంచి బైటపడడమేగాకుండా యుద్ధంలో చచ్చిన ఆమె తాలూకు వారంతా పన్నెండేళ్ల అనంతరం బ్రతుకుతారు.

ఇదంతా చూడగా మనకొక విశేషం కనబడుతుంది. కథలోపల ఎట్లాగున్నా చివరకి సుఖాంతంగా ఉండాలి. సుఖానికి, దుఃఖానికి ఈ కించిత్తే భేదం! కాని దాని ఫలితాలు అధికం! ఇంగ్లీషు నాటకకర్తయైన షేక్స్పియరు తన నాటకానికి పేరే ఆమోస్తరుగా పెట్టేడు. 'సుఖాంతమయినదంతా సుఖం' (All is well that ends well)! అంతవరకు పడ్డపాట్లన్నీ లెక్కకేరావుట! దీనిలో కొంత నిజం లేకపోలేదు. సుఖాంతానికి అంతంలో అంత ప్రభావముంది. భారతదేశకవులలోని ప్రత్యేకత ఇదే! వారు జీవితాలలోని ఘోరాతి ఘోరాలను వర్ణించడానికి వెనుకాడలేదు. కాని కథ చివర చల్లని మాట జారవిడుస్తారు. శ్రోతల మనస్సులు చింతను, అశాంతిని మాత్రమే మోసుకుపోవు. రామాయణంలో రాముడు సీతను తెచ్చుకొని పట్టాభిషేకం చేసుకొన్నాడు. అయితే రామాయణమంతేనా? ఉత్తర రామాయణం ఎక్కడిది? భారతంలో ఆఖరికి స్వర్గారోహణపర్వంచెప్పి శ్రోతలను శాంత చిత్తులనుగా చేసేడు వ్యాసుడు. జీవితమంతా శాంతంకోసమే కదా! కళయొక్క విధికూడ అదే. కాబట్టి ఆంధ్ర జానపదకవులు అదేవిధంగా వచించేరు. ఇది భారతీయ సంస్కృతియొక్క ప్రత్యేకత అని చెప్పాలి. జీవితం సుఖంకోసమే అని పాశ్చాత్య కవులు అంటూన్నా దానిని కళలో పూర్తిగా అనుసరించి మానవ లక్ష్యాన్ని సమర్థించలేదని చెప్పవలసి వస్తుంది. ఆధ్యాత్మికోన్నతిగల భారతదేశానికి ఇట్టి ఆదర్శం సహజమే.

కథ సుఖాంతంగా ఉండాలన్న నియమమున్నప్పటికి దానిని అసహజంగా, అ వ క త వ క గా తీసుకురావడం కళకి గౌరవం కాదు. దానికైన హద్దు ఉండాలి. జంగం కథలలోఉన్న సుఖాంతం అసహజంగా కనబడదు. బాలనాగమ్మ కథలో అంతకుముందు పన్నెండేళ్ల క్రిందటచచ్చిన వాళ్లంతా బతికివస్తారు. ఇది అసహజంగా కనబడవచ్చు. కాని ఎంత మాత్రము కాదు. మాయల ఫకీరు మొదటినుంచి ఇంద్రజాల మహేంద్రజాలాలు చేస్తూనే ఉన్నాడు. ఇదీ అట్టిదే.

సర్వాయిపాపడికథ మట్టుకు దుఃఖాంతంగానే ఉంది. పల్నాటి వీరచరిత్ర, కాటమరాజుకథ కొంత భిన్నం. అవి దుఃఖాంతలుగానే ఉన్నాయి.

'ఏడు' ఒక రహస్యసంఖ్య. సప్త సముద్రాలు, సప్త ఋషులు, సప్త స్వరాలు, సప్త ధాతువులు



ఈమధ్య జన్మదినోత్సవ సందర్భమున భారత ఉపాధ్యక్షులు డా. సర్వేపల్లి రాధాకృష్ణ సతీసమేతంగా.

అగ్నియొక్క సప్త జిహ్వాలు, వివాహములో సప్త పదాలు ఉన్నాయి. హంపీవద్ద ప్రఖ్యాతమైన సప్త పర్వతాలేవంటే- 'హేమకూట, ఋష్యశృంగ, మాతుంగ, అంజనీ, మాల్యవంత, సుగ్రీవ, జాంబవంతములు.' *

ఏడు సంఖ్యా సంప్రదాయానికి మూలం ఎక్కడుందో? వేదాలలో పరిశోధన అవసరం. రామాయణంలో రాముడు ఒక్క బాణంవేసి సప్త తాళాలను కూల్చేడు. పరశురాముడు ఇరవైయొక్కమారు రాజులమీద దండయాత్ర చేసేడు. ఏడు ఆర్యుల సంప్రదాయమో అనార్యుల సంప్రదాయమో తేలాలి!

(సశేషము)

* Journal of the Andhra Historical Research Society, Rajahmundry .. Vol. 18 P. 68






# తెలుగు తల్లీ!

శ్రీ పోలాకి శ్రీనివాస రావు

తెలుగు తల్లీ!
వెలుగు జిలికి
విలువ గొలిపి
తెలుగు బిడ్డల
జెలగ జేయవె
తెలుగు తల్లీ!

కళల గాంచి
కలత లణచి
కలిమి పెంచి
బలము నించి
ఫలము నొసగవె
తెలుగు తల్లీ!

తొలి వికాసము
కలుగ జేసి
తెలుగు దేశము
వెలయ జేసి
కులుక జేయవె
తెలుగు తల్లీ!

——:o:——

## గుణవతి

అనగనగా ఒక రాజు వుండేవాడు. అతనికి అందమైన భార్యకలదు. ఆమెకు లేక లేక ఒక చక్కని పుత్రిక పుట్టెను. రాజదంపతులు ఆ బిడ్డను గారాబముగా పెంచుచుండిరి. ఆ బిడ్డ అందమునకు తగినట్లు చాలమంచి గుణము కలిగియుండెను. ఆ బిడ్డను చూచుకొని వారు ఎంతో ఆనందించెడివారు. ఆమె గుణ రూపములకు తగినట్లు గుణవతియని నామకరణముచేసిరి.

ఇట్లుండగా రాజు భార్యకు జబ్బుచేసి చనిపోయినది. రాజు చాల దుఃఖపడి తుదకు పుత్రికను చూసుకొని కాలము గడుపుచుండెను. మంత్రి, సామంతుల ప్రోద్బలమువల్ల రాజు మళ్ళీ పెండ్లాడెను. ఆమెకు గుణవతియన్న కంటకముగా నుండెను. ఆమెకు ఒక మగబిడ్డ, యిద్దరాడు పిల్లలు పుట్టిరి. వారు పుట్టిన తర్వాత గుణవతిని ఎక్కువ కష్టపెట్ట సాగినది. ఆ

కష్టములు భరించలేక ఒక రోజు వేకువ జామునలేచి పలాని చోటుకను నిర్ధారణ లేక బయలుదేరిపోవుచుండెను. త్రోవలో రేగుచెట్టు మొదట పుట్ట కనిపించెను. రేగుపండ్లకోసరము ఎవరో చెట్టుఎక్కి కంపంతయు పుట్టమీాద వేసియుండిరి. ఆ పుట్టచుట్టు నాగేంద్రుడు తిరుగుచుండెను. గుణవతి ఆ నాగేంద్రుని చూచి వెఱుగుపడి దూరముగా పోవుచుండెను. నాగేంద్రుడు గుణవతినిచూచి రాజపుత్రీ! అని పిలచెను. గుణవతి పినతల్లి పెట్టు కష్టములకన్న పాముకాటుచే చనిపోవుట మేలనిఎంచి నాగేంద్రుని దగ్గిరకు పోయెను. నాగేంద్రుడు పుట్టమీాద నున్న కంపంతయు తీయమనెను. గుణవతి ఎన్నడు కంపముట్టినదేలేదు. ఐనను ఏలాగో కష్టపడి కంపంతయుతీసి శుభ్రము చేసెను. నాగేంద్రుడు 'నీవు ఎవరమ్మా వంటరిగా ఎచటికిపోవుచున్నా'వని యడిగెను. ఆమె తన కథనంతయుచెప్పి కంటనీరిడెను. నాగేంద్రు డామెను దీవించి నాగమణుల నిచ్చెను. ఆమెవానినన్నియు తీసుకొనిపోవుచుండెను.

కొంతదూరము పోవుసరికి ఒక శిథిల దేవాలయము కనిపించెను. ఆ దేవాలయము లోపలకిపోయితన కష్టమును తలచుకొని ఏడ్చుచుండెను. పార్వతీ పరమేశ్వరులు ఆ రోదనమువిని శిథిలదేవాలయములో ఎవరాయనివచ్చిచూచిరి. గుణవతినిచూచి ఆమె సంగతి తెలిసికొని ఆమె గుణము పరిశీలింపనెంచి ఒక వృద్ధుని, ఒక మంచి రాజు కుమారుని చూపించి ఎవరు కావలెనని యడిగిరి. ఆ వృద్ధుని చూచిన తోడనే గుణవతికి జాలివేసి వృద్ధుడు కావలెనని కోరెను. పార్వతీ పరమేశ్వరులు సంతసించి, ఒక పెద్ద భవనమునుచూపి సుఖముగ యుండమనిచెప్పి మాయమయిరి.

ఆమె ఆ వృద్ధుని వెంటబెట్టుకొని ఆభవనము లోపలికిపోయి చూడగా వృద్ధుడు మాయమైపోయి, చక్కని రాజకుమారుడు మెడనిండుగా ఆభరణములతో నుండెను. గుణవతి అవి యన్నియు చూచి ఆశ్చర్యపడి,ఆ పార్వతీ పరమేశ్వరుల దయని వారినెంతో కీర్తించినది. నాటి నుండియు రాజపుత్రుడు గుణవతి సుఖముగ కాలము గడుపుచుండిరి.

మిస్. కె. పద్మ



# సంపాదకీయములు

## స్వవిషయం

తండ్రిలేని కొరతలేకుండా మీఆదర సంచిక యొకటి కాగలదని మా విశ్వాశాభిమానములతో మా 'గృహలక్ష్మి' సను. దేవీ త్రిపుర సుందరి అనుగ్రహము దసరా ముస్తాబులో మీ కరకమలముల వలన మరింత ఆకర్షణీయంగా మా పత్రిక నలంకరించుచున్నది. ఈ దసరా ఉత్సవాల రచయితలు, పాఠకులు, శ్రేయోభిలాషుల సమయమున ఆనందాతిశయములను సమ సహాయ సహకారములతో వర్ధిల్లకలదని కూర్చువానిలో మా 'గృహలక్ష్మి' దసరా ఆశిస్తున్నాము.

## ఉద్దేశాలు – లక్ష్యాలు

ఉమ్మడిగా మద్రాసు రాష్ట్రంలో అభివృద్ధి అభ్యుదయాలు కుంటుబడిన ఆంధ్రభాష, సంస్కృతి ఆర్థిక వ్యవస్థలను సాధించి చక్కదిద్దుకొనుటకని షుమారు 40 సంవత్సరములు జరిగిన ఆందోళన, ఉద్యమ ఫలితంగా యిప్పటికి ఆంధ్రరాష్ట్రము సిద్ధించింది. ఆంధ్రరాష్ట్ర నిర్మాణముపట్లచూపిన ఆసక్తినే దాని రూపు రేఖలను దిద్దుటకు సాంఘిక, ఆర్థిక, రాజకీయ రంగాలలో స్త్రీలు, పురుషులు చూపించి త్యాగసేవా సక్తితో కృషిచేసినచో ఆంధ్రరాష్ట్రోద్యమము ఫలించినట్లు కాగలదు.

ఈ నూతన రాష్ట్రపు రూపురేఖలుదిద్దే విషయంలో స్త్రీలు సయితం ప్రధానపాత్ర నిర్వహించవలసి యున్నది. పంచవర్ష ప్రణాళిక విజయవంతం కావడానికేమి, రాష్ట్రములో ప్రజాహిత కార్యకలాపాల నిర్వహణకేమి ఏకోన్ముఖంగా ప్రభుత్వ ఆర్థిక వ్యవస్థకు ప్రజలు సహాయ సహకారాలు కావాలి. ఈ సందర్భమున స్త్రీల స్మాలు సేవింగ్స్ స్కీముద్వారా ఎంతైనా తోడ్పడవచ్చును. అవసరానవసరములను గుర్తించి కుటుంబ ఖర్చులు పొదుపుచేసి మిగల్చకలిగిన చిన్న చిన్న మొత్తాలను ప్రభుత్వమునకు పెట్టుబడి పెట్టినచో ప్రజోపయోగమయిన ప్రణాళికలు నిర్వహించబడుటయేకాక తాము పెట్టుబడి పెట్టిన అసలుతోబాటు వడ్డీ కూడ లభ్యమగుచున్నది. ఈ చిన్న మొత్తముల సేకరణ ఆంధ్రదేశంలో ముఖ్యంగా భూస్వాములు, రైతు కుటుంబాలలో జయప్రదంకాగలదు. అందులోను మాగాణి భూముల ప్రాంత్యాలలోని స్త్రీలు యీ ఉద్యమంపట్ల మరింత ఉత్సాహం ప్రకటించగలరని మా నమ్మకం.

వరకట్నాలు, వితంతు వివాహాలు, విడాకులు, పురుషులతోబాటు సమాన హక్కులు మొదలగు మహిళా లోకానికి సంబంధించిన సమస్యల పరిష్కారానికి చట్ట నిర్మాణము అవసరమయినా ప్రతి సమస్యకు సంబంధించిన సదుద్దేశాలను, మంచిచెడ్డలను ప్రజలలో ప్రచారంచేసి సహకార సానుభూతులను సంపాదించాలి. ప్రజల సహకారములేని ఏ చట్టము సమర్థనీయంగా అమలు జరుగనేరదు.

రాష్ట్రపు ఆర్థిక పురోభివృద్ధికి పునాదివంటి కుటుంబం బాగుపడాలి. అందుకు కుటుంబములోని ప్రతియీడువచ్చినవ్యక్తి చేయతగిన, కలిగిన పనిచేసి కుటుంబ ఆదాయం పెరుగడానికి మార్గాలు అన్వేషించాలి. పనిచెయ్యడానికి తయారుగానున్నవారికి వృత్తి చూపించి ప్రభుత్వము నిర్మాణ కార్యక్రమము నిర్వహణకు వినియోగించుకొనుటవలన దేశము, ప్రజలుకూడ బాగుపడగలరు. ఈ సందర్భమున ప్రజావసరములను తీర్చగల చిన్న చిన్న పరిశ్రమల స్థాపన, బీడుగాపడియున్న సాగుకు అనువైన సారవంతమైన భూముల మరమ్మతు, ప్రాజక్టుల నిర్మాణములాంటి ప్రణాళికల నిర్వహణ ప్రజలకు ప్రభుత్వమునకుకూడ అనేక విధముల నుపకరించ కలదు.

రాజకీయ రంగంలో సయితం స్త్రీలకు ఉచిత ప్రాధాన్యమిచ్చి ఆర్థిక, గ్రామపునర్నిర్మాణ, గృహపరిశ్రమ లలాంటి శాఖల నిర్వహణకు మహిళల సహాయ సహకారములను ప్రభుత్వము వినియోగించుకోవలసియున్నది.

# స్వీ కా ర ము

తేనె సోనలు (ద్వితీయమధుకోశము) : విద్వత్కవిభూషణ-విద్వాన్ వేదము వేంకట కృష్ణశర్మగారు, 66 సామిపిళ్లై వీధి, మద్రాసు 7. వెల రు 1-4-0.

చక్కని ముఖచిత్రముతో పేరుకు తగినట్టి మధుమయమైన కవితాశైలితో యీ గ్రంథము విరాజిల్లు చున్నది. గ్రంథకర్త చేస్తున్న అపారమైన భాషా సేవ, పరిశ్రమ ఫలితంగా ఆంధ్రప్రజానీకానికి మృదు మధురమైనట్టి కవితా సంపదను అనేకగ్రంథ రచనల మూలముగా నందిస్తున్నారు. అట్టి వానిలో యీ తేనె సోనలు గ్రంథమొకటి.

ఇందులో పదునాలుగు పద్యకావ్యములున్నవి. వీనిలోనివి చాలవరకు యింతకు ముందు భారతి, 'గృహలక్ష్మి', ఆంధ్ర పత్రిక, త్రిలిఙ్గ మొదలుగాగల పత్రికలలో ప్రచురించబడినవి. ప్రతి యొక్కటి భావ రస భరితమై చక్కని జాతీయములతోను, నవ్యభాషా పదములతోనుండి అభ్యుదయకవికుమారుల కావ్యరచనకు మార్గదర్శకముగానున్నది.

ఇట్టి గ్రంథము ఉన్నత విద్యా ప్రణాళికలో పాఠ్యగ్రంథముగా తప్పక నిర్ణయించ తగినది.

# శ్రీ విజయనామ సం॥ర ఆశ్వయుజ-కార్తీకమాసములు.

| నెల | తేదీ | వారం | వివరములు |
|---|---|---|---|
| 1953 సం॥ అక్టోబరు నెల | 16 | శు | అ 9-4 ఉషా 31-36 త్యా 3-5 వ.రా 10-26 మొ 11-59 వ దుర్గాష్టమి |
| | 17 | శ | న 5-49 శ్ర 29-33 త్యా 3-48 వరా 9-32 మొ॥ వ విజయదశమీ శమీపూజ |
| | 18 | ఆ | ద 1-26 ఏష్యా 54-31 ధ 26-33 త్యా 3-45 వరా 11-17 మొ 12-47 ఏకాదశి |
| | 19 | సో | ద్వా 50-3 శత 22-48 త్యా 3 43 వరా 8-59 మొ 10-28 వ |
| | 20 | మం | త్ర 43-46 పూభా 18-26 వరా 10-11 మొ 11-40 వ |
| | 21 | బు | చతు 37-20 ఉభా 13-54 వరా 10 36 మొ 12-5 వ |
| | 22 | గు | ○ పూర్ణిమ 31-2 రే 9-19 వతె 4-11 మొ 5-40 వ |
| | 23 | శు | బ.పాడ్యమి 25-3 అశ్వ 4-50 వసా 4-54 మొ 6-24 వ |
| | 24 | శ | విదియ 19-48 భ 1-13 వరా 5-55 మొ 7-27 వ తిధిద్వయం |
| | 25 | ఆ | తదియ 15-25 కృ 56-37 వరా 8-52 మొ 10-25 వ (అట్లతద్ది) |
| | 26 | సో | చ 12-1 మృ 55-48 వప 10-8 మొ 11-48 వ |
| | 27 | మం | పం 9-50 ఆ 56-11 వప 12-44 మొ 2-21 వ |
| | 28 | బు | ష 8-52 పున 57-49 వసా 4-47 మొ 6-26 వ |
| | 29 | గు | స 9 14 పుష్య 60-10 వతె 1-28 మొ 3-8 వ |
| | 30 | శు | అ 10-48 పుష్య 0-31 వరా 7-48 మొ 9-30 వ. |
| | 31 | శ | న 13-26 ఆశ్రే 4-15 వరా 8-48 మొ 10-32 వ |
| నవంబరు నెల | 1 | ఆ | ద 16-58 మఘ 9-3 వరా 6-20 మొ 8-4 వ ఏకాదశితిథిః |
| | 2 | సో | ఏ 21-1 పూఫ 14-19 వరా 7-40 మొ 9-26 వ శూన్యతిథిః |
| | 3 | మం | ద్వా 25-47 ఉఫ 20-20 వరా 11-25 మొ 1-11 వ ద్వాదశీతిథిః |
| | 4 | బు | త్ర 28-44 హ 26-20 వరా 1-20 మొ 3-5 వ నరకచతుర్దశి |
| | 5 | గు | చతు 34-38 చి 32-10 వరా 1-1 మొ 2-46 వ |
| | 6 | శు | ● అమా 39-25 స్వా 37-38 వతే 3-9 మొ 4-53 వ దీపావళి |
| | | | **కార్తీకమాసము** |
| 1953 సం॥ | 7 | శ | శుద్ధపాడ్యమి 42-44 విశా 42-25 వతే 3-16 మొ 4-58 వ కార్తీక స్నానారంభః |
| | 8 | ఆ | విదియ 45-31 అనూ వర్జ్యంలేదు యమద్వితీయా భగినిహస్త భోజనం |
| | 9 | సో | త 46-56 జ్యే 49-16 వ ఉ 6-20 మొ 8-9 వ త్రిలోచన గౌరివ్రతం |
| | 10 | మం | చ 47-17 మూ 50 59 వ ఉ 9-59 మొ 11-38 వ |
| | 11 | బు | పం 46-20 పూషా 51-27 వ ఉ 12-8 మొ 1-45 వ నాగపంచమీ |
| | 12 | గు | ష 44-9 ఉషా 50 50 వప 10-24 మొ 12-9 వ |
| | 13 | శు | స 40-48 శ్ర 48-40 వ ఉ 6-16 మొ 7-49 వ |
| | 14 | శ | అ 36-27 ధ 46-0 శేష వ ఉ 6 54 వ తిరిగివర్జ్యంలేదు |
| | 15 | ఆ | న 31-16 శత 42-38 వ ఉ 7-17 మొ 8-47 వ అక్షయనవమీ |

Printed & Published by Dr. S. Seshagiri Rao at Lodhra Press, Kesari Kuteeram Ltd.
15. Westcott Road, Royapettah, Madras.
Founder-Editor: Dr. K. N. Kesari; Ag. Editor: C. C. Punniah.




### సాలుచందా మొదలగునవి

ఈ సచిత్రమాసపత్రిక సాలుచందా రు 4-8-0. అర్ధసంవత్సరపు చందా రు.2-8-0. అంతకు తక్కువ కాలపరిమితి చందా పద్ధతి లేదు. విడికాపి ఆరు అణాలు. చందాదారులు ఏమాసమునుండియైన ప్రారంభము చేయవచ్చును. విడికాపీలు వలయువారు వాని విలువమేరకు తపాలాబిళ్లలు పంపవలయును. వీ. పీ. పద్ధతి వ్యయమూలకము. బర్మాకు రేట్లు ప్రత్యేకము.

### ప్రకటనలు

ముఖ్యముగా స్త్రీలకందీయనలసిన వస్తువులనుగూర్చి ప్రకటించుటకీపత్రిక ఎంతయు అనువైనది. ప్రకటన చార్జీలు ప్రతిమాసము ముందుగానే చెల్లింపవలయును. కాలుపుటకు తక్కువయైన ప్రకటనలు చేకొనజాలము. రేట్లకొఱకు వ్రాయునది.

### వ్యాసములు వ్రాయువారికి

వ్యాసముల ముఖ్యాశయము స్త్రీజనాభ్యుదయమైయుండవలెను. అవి సంగ్రహముగ నున్న శీఘ్ర ప్రచురణకు వీలగును. ఒకేప్రక్క సిరాతో స్పష్టముగ తప్పులులేక వ్రాయవలెను. భాష గ్రాంధికముగాని, వ్యావహారికముగాని కావచ్చును: రెండును కలిపి వ్రాసిన అంగీకరింపబడవు. వ్యాసముల ప్రకటించుటలో సంపాదకులకు సర్వహక్కులు గలవు. ప్రకటింప నంగీకరింపబడినపుడు మాత్రము రచయితల కట్లు తెలుపబడును. విమర్శనార్థము పంపు గ్రంథములు రెండుప్రతులు పంపవలెను. రిప్లైకార్డు వ్రాసిననే బదులివ్వబడును.

### సంచికలు చేరనిచో

సంచికలు చేరనిచో ఆయామాసములందు వెంటనే మాకు తెలుపవలయును. చిరునామామార్పును తెలుపకుండుటచే కాపీలు చేరనివారికి తిరుగ పంపజాలము. సంచికలు చేరనివారు తమతమ పోస్టాఫీసులలో కంప్లైంటును చేయునది.

### చిరునామా మార్పు

చిరునామాయందు మార్పుఉండుచో ముందుగానే తెలుపవలయును. ఇట్లు తెలుపనిచో కాపీలు తిరుగ పంపజాలము.

### ముఖ్యమైన గమనింపు

చందాదారులుగ చేర్చుకొనుమని వ్రాయు ఉత్తరములు, ఇతరమైన ఉత్తరములు మానేజరు, గృహలక్ష్మి, రాయపేట, మదరాసు అను చిరునామాకే వ్రాయవలయును. చెక్కులు, మనియార్డర్లు, పోస్టలు ఆర్డర్లు 'కేసరికుటీరం లిమిటెడ్' పేర పంపవలెను.

చెక్కులు మద్రాసు బ్యాంకులపైననే పంపవలెను.

Lodhra Press, Madras- 14.